Regd No. N 45 / M. 3813





# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

103412



సంపుటము ౧౨ హైద్రాబాదు-దక్కను శా.శ.౧౮౬౦ బహుధాన్య నామసంవత్సర చైత్ర శు॥ ౪ (౩౧ అర్దిబెహిష్తు ౧౩౪౭ ఫ.) సోమవారము సంచిక ౨౨

# రబ్బీ కిస్తులో సగము బరాయిందా

## నిమ్నజాతుల సాంఘిక అసౌకర్యములనివారణ

మదరాసు అసెంబ్లీలో

యం. సీ. రాజాగారి చిత్తుచట్టము

మదరాసు ఏప్రిల్ ౧

నిన్న మదరాసు అసెంబ్లీసభ ౩ గం. లకు సమావేశమైనపుడు ప్రశ్నలఅనంతరము రావుబహదర్ యం. సీ. రాజాగారు హిందువులలో నిమ్నజాతులవారలకు గల సాంఘిక అసౌకర్యములను తొలగించుటకు ఒక చిత్తుచట్టమును ప్రవేశపెట్టుచు, ఆబిల్లును సెలెక్టుకమిటీవారి విచారణకు పంపవలెనని సూచించిరి.

రాజాగారు తమ అస్పృశ్యతా నివారణ చట్టము యొక్క పూర్వోత్తరములను చెప్పి సంఘమునందు మానవులుగా పరిగణింపబడుట కుగల ప్రాథమికహక్కులుగూడ కొన్ని జాతులవారికి లేవనియు, నాగరికతగల ప్రభుత్వము వారు ఇట్టిఅన్యాయమును సహించజాలరనియు చెప్పిరి. ముగించుచు ప్రస్తుతశాసనము (చిత్తు) మతముతో ఏమాత్రము జోక్యము కలుగజేసికొనదనియు, సవర్ణహిందువులకు ఈచిత్తుచట్టమువలన ఏమాత్రము ఇబ్బందులు కలుగవనియు, గాంధిమహాత్ముని సమ్మతితో ఈచిత్తుచట్టము తయారుచేయబడినదనియు చెప్పిరి.

సభలో అన్నిపక్షముల ప్రతినిధులును చిత్తుచట్టమున కనుకూలముగ నుపన్యసించిరి. ప్రధానమంత్రిగారుపన్యసించుచు బావులన్నిటిని హరిజనులకు తాకనిచ్చుట నేడుగూడ అంతము లభమైనపని గాదనియు, ఇట్టిచట్టము మనము ప్రవేశపెట్టుటకుగల ముఖ్యోద్దేశమును ఎరుగకపోలేదనియు, ఇట్టిఉద్యమమునకు మతబోధ తోడ్పడినపుడే అది జయించును గాని మతావేశమును విడిచిపెట్టినచో అది ఫలించజాలదనియు, ప్రభుత్వమువారు ఈశాసనముపట్ల అనుకూలాభిప్రాయము నే కలిగియున్నారనియు చెప్పిరి.

సెలెక్టుకమిటీ అధ్యక్షురాలుగా శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారిని స్పీకరుగారు నామినేటుచేసిరి.

## రబ్బీకిస్తులో బరాయిందా

(గోలకొండ విలేఖరి)

మహబూబు నగరం, ఏప్రిల్ ౪

సూబేదారుగారు క్షామమువలన బాధితులగుచున్న రైతుల సహాయార్థము జిల్లాయందు రబ్బీ కిస్తులలో పరిష్కారము నకుపరకు అర్ధభాగము బరాయిందా చేయుటకు ఆజ్ఞాపించినటుల రూఢిగా తెలియుచున్నది. తహశీల్దారుల పేర ఆజ్ఞాపత్రములు బంపబడినవి.

## సత్యవతి దేవిపై నిషేధాజ్ఞ

ఢిల్లీ, ఏప్రిల్ ౨

మార్చి ౧౨వ తేదీని పంజాబు రాష్ట్రీయ రాజకీయసభకు శ్రీమతిసత్యవతిగారు వెళ్లగా నాటిరాత్రి ఎమర్జెన్సీపవర్ ఆక్టు ననుసరించి ౨౪గంటలలో పంజాబునువిడిచివెళ్లమనిన్ని, నేటినుండి సంవత్సరంవరకు ఈరాష్ట్రంలో అడుగుపెట్టరాదని పంజాబు గవర్నమెంటువారు శ్రీమతి సత్యవతిగారికి నోటీసుయిచ్చినారు. ఆనోటీసులో తనపేరు తప్పుగా వ్రాయబడినందునని రాకరించిరి.

కాంగ్రెసుపార్టీవారు ఈవిషయాన్నిగురించి పంజాబు ఎసంబ్లీలో చర్చించుటకొరకు ఆలోచనలు చేయుచున్నారు.

## కేవలము పెద్దపట్టేదారులే గాక బీదరైతులు సహితము లాభము పొందవలయునని

## పాలకుల రైతాభిమానము

## పంటలుపాడైన రైతులకు ప్రభుత్వము సాయపడుట

అత్రాపుబల్దా జిల్లావాసులకు మోక్షము తాలూక్దారి ఆధీనము

(గోలకొండ ప్రత్యేక విలేఖరి)

భువనగిరి, ఏప్రిల్ ౩.

భువనగిరి తాలూకాయందు రబ్బీకిస్తులలో అర్థభాగము బరాయిందా చేయుటకు సుబేదారుగారు ఆజ్ఞయొసంగియున్నారు. గ్రామములయందు ఆదేవిధముగ నాచరింపబడుచున్నది ఈసంవత్సరము రబ్బీపంట (ఈప్రాంతమునందిది 'ఆమునవృపంట') సంపూర్ణముగావర్షములేక నశించిపోయినది. నిజముగా పరిశీలించిన మొత్తము కిస్తు బరాయిందా గావలసినదే! ఐనప్పటికిని అర్థభాగము లభించుటగూడా రైతుల కెంతయో మేలుకలిగి రైతులు సంతృప్తి జెందుచున్నారు

సూబేదారుగారు తమఆజ్ఞయందు ప్రభుత్వమువారొసంగిన ఈలాభము, పెద్ద భూస్వాములకుమాత్రమేకలుగక, బీదరైతులందరికిని చెందవలయునని, స్పష్టముగా వక్కాణించియున్నారు: వారిఆజ్ఞ ననుసరించియే, తహాసీలునుండి పటేలుపట్వారీలకు, బీదరైతులందరు దీనినుండి లాభపడునట్లు జూచుటకై ఆజ్ఞాపత్రము లంపబడినవి. పెద్దపట్టేదారులు, ఎక్కువగా పటేలుపట్వారీలే గావున దీని యాచరణ ఎంతవరకు జరుగునో గాంచవలసియున్నది.

అత్రాపుబల్దా జిల్లాకుచెందిన ఎన్నియోగ్రామములు భువనగిరితాలూకా గ్రామములతో నంటియున్నవి. కొలమాన పరిస్థితులే రెండు తాలూకాలయందు నొకేవిధముగ నుండి, ఫలితముగూడా నొకేవిధమున జరిగినది. భువనగిరి రైతులకు లభించిన అవకాశము తమకుగూడా లభించునని వారుగూడా పెద్ద ఆశతోనున్నారు, సుమారు వారము దినములక్రింద షర్ఖీ తాలూకాకుచెందిన సుమారు ౫౦౦మంది రైతులు, హైద్రాబాదుకువెళ్లి, తాలూక్దారువద్దను, సదరుల్‌మహాంవద్దను. సరఫుఖాసుకమిటి సభ్యుల సముఖమునకు దరఖాస్తులు పెట్టికొనియుండిరి. విచక్షణకై తాలూక్దారుగారు పర్యటనము గావింపనున్నారు. వీరిపర్యటన ౨ ఏప్రిల్‌నుండి ఆరంభింపబడినది. తెలియుచున్నది. వీరిరిపోర్టుపై ముందుజరుగబోవు కార్యక్రమము ఆధారపడియున్నది. రైతులుమాత్రము తమకు భువనగిరివలెనే అర్థభాగము బరాయిందాలభించునని గట్టినమ్మకముతో నున్నారు.

ఈడు జోడులేని

వివాహము లాపుటకు

## స్త్రీల నిశ్చయము

నాసిక్, ఏప్రిల్ ౧

సుమారు ౨౦ మంది హిందూ స్త్రీలు పూర్వమునుండి ఆచరించబడుచున్న పర్దాపద్ధతిని తొలగించి సంఘసంస్కార కార్యములందు బహిరంగముగా సమరయోధులవలె తమ కర్తవ్యము నిర్వహించుటకు నిశ్చయించుకొనిరి. ఇంతేగాక వీరు యీగ్రామమునందు యీడుజోడులేక జరుగుచున్న యొక ధనికునివివాహమాపివేసిరి. పెండ్లివారు వరునియుక్తముగా కన్యాదాత గృహమునకు నూరేగింపుతో వెళ్లుచున్నప్పుడు "సిగ్గు" "సిగ్గు" అని ఒలకుచు "ఈడుజోడుగాని వివాహము అంతమొందుగాక" యని కేకలిడిరి. కాని వరుడు, వారి సంబంధకులీ స్త్రీల అసమ్మతిని లెక్కించనందున స్త్రీలు వివాహమంటపమువద్ద శాంతియుతముగా సత్యాగ్రహమొనర్చిరి. స్త్రీల అభ్యుదయమునకై సోదరీమణులు సలుపుచున్న అమూల్య ప్రయత్నములగాంచి వధువు "ముసలివానిలో వివాహమాడి నాజీవితమును నాశనమొనర్చుకొనజాల"నని వరునికి స్పష్టముగా తెలియపరచెను,

## తపాల తగ్గింపులు

ఢిల్లి, మార్చి ౩౧

ఇండియా బర్మాదేశములమధ్య ప్రస్తుతము గల తపాలురేట్లలో ౧ ఏప్రిల్‌నుండి ఈక్రింద తగ్గింపు అమలునందు చేర్పబడగలదు

పోస్టుకార్డు రెండణాలకు మారు అణా రెండు కార్డు నాలుగణాలకు మారు ౨ అణాలు కవరు పొన్సులకు మించకున్న రెండున్నరణాలకుమారు రెండణాలకు తగ్గింపబడును.

## మదరాసుస్పీకరు సాంబమూర్తి యూరోపాయాత్ర మానుకొనుట

కాంగ్రెసు కార్యకారిణీసంఘమునుండి ఆదేశము

మదరాసు ఏప్రిల్ ౨



మదరాసు అసెంబ్లీస్పీకరు గా. బులుసు సాంబమూర్తిగారు ఇపుడు యూరోపా యాత్రకు పూనుకొనుట కాంగ్రెసుకు క్షేమకరముగాదని కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారు తలచి, సాంబమూర్తిగారిని ఇపుడాప్రయాణము పెట్టుకొనవలదని ప్రార్థించవలసినదిగ ప్రధానమంత్రి రాజగోపాలాచారిగారికి టెలిగ్రాము పంపినట్లు తెలిసి, అసోసియేటెడుప్రెస్సు వారు సాంబమూర్తిగారిని నేడు విచారించగా, పోయినరాత్రి తనకట్టి టెలిగ్రాము వచ్చియుండెననియు, తదనుసారము యూరోపాప్రయాణము మానుకొంటిమనియు తెలిపిరి.

ఆచంట రుక్మిణమ్మగారు

రాజీనామా నుపసంహరించుకొనుట

శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారు కాంగ్రెసుపక్షమునకును తన అసెంబ్లీ డెప్యూటీస్పీకరు స్థానమునకును ఇచ్చిన రాజీనామాను ఉపసంహరించుకొనిరి.

## ఆస్సాంలో కాంగ్రెసు సంయుక్త మంత్రివర్గ మేర్పడు ఆశ

కలకత్తా: ఏప్రిలు ౧

హరిపుర కాంగ్రెసు మహాసభ జరిగినతర్వాత రెండవసారి కాంగ్రెసు కార్యకారిణీ సంఘసమావేశము నేటి మధ్యాహ్నము రెండుగంటలకు కాంగ్రెసు అధ్యక్షులగు సుభాషు చంద్రబోసుగారి ఇంటియందు సమావేశమయ్యెను.

సుభాసు చంద్రబోసు, పండిత జవహర్లాలు నెహ్రూ, సర్దార్ వల్లభాయిపటేలు, బాబు రాజేంద్రప్రసాదు, భూలాభాయిదేశాయి, జయరాందాసు దౌలతురాం, మౌలానా అబుల్ కలాం ఆజద్, జమ్నలాల్ బజాజ్, డాక్టర్ పట్టాభి, శరచ్చంద్రబోసు, హరికృష్ణ మెహతబ్ ఆచార్య కృపాలినిగారలు హాజరైయుండిరి.

మొదట అస్సాం అసెంబ్లీలో కాంగ్రెసు పక్ష నాయకుడగు బార్డొలాయిగారితో అస్సాంనందు కాంగ్రెసు మంత్రివర్గ మేర్పరచుటకుగల అవకాశములనుగూర్చి మూడు గంటలసేపు చర్చించినట్లు తెలియుచున్నది. మొత్తము సమావేశము ౭ గంటలకాలము జరిగెను. బార్డొలాయిగారు అస్సాం అసెంబ్లీలో మొత్తము ౧౦౮మంది సభ్యులలో ౩౬ మంది కాంగ్రెసు వారలనియు, ఈ కాంగ్రెసుపక్షము మరి ౧౫ మంది సహాయము సంపాదించినదనియు, మరి నలుగురు ఈపక్షమున చేరినచో కాంగ్రెసు మంత్రివర్గము నేర్పరచుటకు తనకనుమతి యొసగవలసినదనియు నాతడు చెప్పినట్లున్నది. ఇంతవరకు కార్యకారిణీ సంఘమువారు కాంగ్రెసు కార్యక్రమమును సంపూర్ణముగ సాగించుచో, కాంగ్రెసు పక్షమువారు ఇతరులతో చేరి మంత్రివర్గమేర్పరచుటకు తనకెట్టి యభ్యంతరముగాని లేదని చెప్పినట్లున్నది. బార్డొలాయిగారు బైటికి వచ్చినపుడు వారిని అసోసియేటెడు ప్రెస్సు వారడుగగా వారు "అవసరమైన సహాయమును పొందగలనని నాకు నమ్మకముగలదు." అనిరి.

కార్యకారిణీ సంఘమువారు దేశములో పరిస్థితినిగూర్చి గూడ ఆలోచించిరి. దేశములో మత కలహములనుగూర్చియు, వాటిని తొలగించుటకు మార్గములనుగూర్చియు కూడ ఆలోచించిరి. మరియు మధ్యరాష్ట్రములో న్యాయశాఖ మంత్రియగు షరీఫుగారు, బలవద్గమనము చేసినందుకై శిక్ష ననుభవించుచుండిన జాఫరుయొక్క విడుదలకై ఉత్తరువు చేసియుండిన విషయమునుగూర్చియు ఆలోచించిరి.

గాంధి మహాత్ముడు

గాంధిమహాత్ముడు, మహాదేవ దేశాయిగారితోను, మౌలానా అబ్దుల్‌కలాం ఆజద్ గారితోను, హరికృష్ణ మెహతబ్ గారితోను కలిసి నేడుదయము మిచటికిచేరిరి. సుభాస్ చంద్రబోసుగారు మహాత్ముని మెడలో పూలమాల వేసిరి. మహాత్ముడు శరచ్చంద్రబోసుగారి ఇంటవిడిసిరి. బండిదిగినపుడు గాంధిగారు ఉత్సాహముగా కనపడిరి. డాక్టరు బి.సి.రాయ్, సునీల బోస్ గార్లు నేడు మధ్యాహ్నము పరీక్షించిరి.

కార్యకారిణీసంఘ సమావేశమునకు ముందు సర్దార్ పటేల్ గారును, భూలాభాయి దేశాయిగారును, మహాత్మునితో అర్థగంటసేపు సంభాషించిరి. జవహర్లాలుగారుగూడ ఆ సమయమున అటనేయుండిరి.

కార్యకారిణీ సంఘమువారు మహాకోసల కాంగ్రెసు ౧౯౩౯ ఫిబ్రవరి కడపటివారములో జరుగునట్లును అధ్యక్షుని ఎన్నిక ౨ ఫిబ్రవరి ౧౯౩౯ నాడు ప్రకటించబడునట్లును నిశ్చయించెను. రాత్రి ౯౹ గం.లకు సమావేశము ముగిసెను.

రెండవ సమావేశము

కలకత్తా ఏప్రిలు ౨

కార్యకారిణీసంఘము నేడుదయము ౮గం. ౧౫ని లకు సమావేశమయ్యెను. నిన్నవచ్చిన ౧౨మంది సభ్యులేగాక బీహారు ప్రధాని శ్రీ కృష్ణసింహగారును ఆహ్వానముపై వచ్చియుండిరి. వీరు ఇపుడు బీహారు రాష్ట్రములో నివసించుచున్న బెంగాలీయులు, బీహారీయుల

## యూరపుఖండమున వైరుధ్య భాగములలో విభజితము కాకుండ జేయుటయే

## బ్రిటిషు విదేశాంగనీతి

రాజనీతి సాఫల్యతకు జాతీయనీతి, శక్తిసామర్థ్యముల విశ్వాస మత్యవసరము

## లార్డు హాలిఫాక్సుగారి నిర్వచనము

లండన్, మార్చి

"మనము ప్రజాస్వామ్య సంస్థల సంరక్షించుట ముఖ్యకర్తవ్యము. వ్యక్తిగతహక్కులు-అస్వాతంత్ర్యమును కాపాడవలయును, ఏదేశముల స్వాతంత్ర్య ఆశయముల గౌరవించవలయును. యూరపుఖండమును పరస్పర వైరుధ్యభాగములలో విభజితముగాకుండ ప్రయత్నింపవలయును, వీలగునంతవరకు పరస్పర సానుభూతి, సహనము ప్రబలింపజేయుటకు శక్తికొలది ప్రయత్నించవలయును" అని లార్డుహాలిఫాక్సుగారు పార్లమెంటునందొక సభ్యుని ప్రశ్నకు బ్రిటన్ విదేశాంగనీతినివిశదపరచుచు ప్రత్యుత్తరమొసగెను.

ఇంతేగాక "మనగౌరవములు విదేశములలో మనప్రభుత్వము లేక రాజకీయ చతురతవలన గాక మనవ్యక్తిత్వమువలన నిర్ణయించబడును. మనమందర మొకజాతిగా సమిష్టిరూపమున మనసీతి, భౌతిక శక్తివిశ్వాసముల విశదపరచగలిగినను మన రాజనీతి విజయవంతమైతీరును. దీనికి వ్యతిరేకముగా జరిగిన మనమెంతజాగ్రతగా ప్రవర్తించుటకు ప్రయత్నించిన మనకు విముక్తి కలుగదనుట నిశ్చయము" అని నుడివిరి.

స్పెయిన్ సమరవిషయములో హాలిఫాక్సు ప్రభువుగారు వీలగునంతవరకు తటస్థభావమే అవలంబింపబడునని సభ్యులకు విశ్వాసము కలిగించిరి.

నుగూర్చి పత్రికలలో చెలరేగుచున్న వాదోపవాదములకు, సంబంధించిన వాస్తవమును తెలుపుటకై పిలిపించబడిరి బెంగాలీయుల నాయకుడు ఇదివరకు పాట్నాహైకోర్టు జడ్జిగనుండిన పి. ఆర్. దాసు గారగుటచే ఈసమస్య ప్రాముఖ్యత వహించినది.

కార్యకారిణీ సంఘమువారు బెంగాలు అసెంబ్లీలో కాంగ్రెసు వారు ఇతరపక్షములతో కలిసి మంత్రివర్గము నేర్పరచుటకుగల అవకాశములనుగూర్చి కూడ ఆలోచించబడెను,

ఇదిఇట్లుండ బెంగాలుఅసెంబ్లీ కాంగ్రెసు పక్ష నాయకుడగు శరచ్చంద్రబోసు, కాంగ్రెసు పక్షముయొక్క విప్ అగు జె. సి. గుప్తగారి యింటిలో ప్రస్తుత మంత్రివర్గ పక్షము నధిగమించక అభివృద్ధిమార్గమును గోరు ఇతరపక్షముల విశ్వసనీయప్రతినిధులతో రహస్యముగా సంభాషించెను. మంత్రివర్గపక్షమునుండి చీలిన కర్షక ప్రజాపక్షము, స్వతంత్ర ప్రజాపక్షము, షెడ్యూల్డుపక్షము-ప్రతినిధులందరును సభకువచ్చిరి. రాజీనామానిచ్చు విషయమై యత్నములో నున్న స్థానిక స్వపరిపాలన శాఖ మంత్రియు నసమావేశమునకు హాజరైయుండెను.

శరత్ బోసుగారు ఈ సభనుండి నేరుగా కార్యకారిణీసంఘ సమావేశమునకువచ్చి జరిగినదానిని తెలిపిరి. సంఘమువారు మహాత్ముని అభిప్రాయముపొందిగాని నిర్ణయించరు,

మౌలానా అబుల్‌కలాంఆజద్‌గారు పోడారనంతచే జయరాందాసు గారిని పంజాబులో కాంగ్రెసు వివాదములను దీర్చుటకును, కరిహద్దు రాష్ట్రములో కాంగ్రెసువ్యవస్థలో మార్పులుచేసి బలపరచుటకును పంపుటకై తీర్మానించబడెను.

## ని.ష్టే.వ. నైజాంస్టేటురైల్వే

## ఒకసమస్యా పరిష్కారింపబడినది

సరసమైన చార్జీలతో హాయిగానుండు బస వలయువారికి ఔరంగాబాదులోని స్టేటు రైల్వేహోటల్. చక్కని విశ్రమస్థానము నవీన సౌఖ్యపు టేర్పాట్లన్నియు నేర్పరచ బడినవి.

1 ఏప్రిల్ 1938 నుండి అమలులోనికి వచ్చును.

పూర్తి వివరములు వలయువారు

హోటల్ వ్యవస్థాపకురాలు,

ఔరంగాబాదుకుగాని లేక

చీఫ్ కమర్షియల్ మేనేజరు

ని.ష్టే.వ. నైజాం స్టేటురైల్వే

సికింద్రాబాదుకుగాని వ్రాయుడు.

వైప్లవకులు: వైముక్తకులు ౨

# వీర నారీమణి

# పాషియోనారియా

## వీరచరిత్రలో అగ్రస్థానమలంకరించిన యీమె నినాదము నామముగా మారుట

## మనశత్రువన్ని చీడపురుగుల్లా విదల్చినకొలదీ మన విజయం నిశ్చయం

[హారీపాలిట్ బ్రిటిషు కమ్యూనిస్టు. పాషియోనారియా జన్మదినోత్సవ సందర్భమున ఈవ్యాసం వ్రాశాడు. ఈ మహత్తరవ్యాసాన్ని "నవశక్తి" ద్వారా మాపాఠకుల కందింపగలిగినందులకు సంతసించుచున్నాము. కృతజ్ఞులము.]

ఆస్ట్రియాలోని ౪౨ ఏండ్ల క్రిందట ఒక చిన్న పల్లెలో డాలోరెస్ ఇబార్ షిరూరి జన్మించింది. ఇప్పు డామె "పాషియోనారియా" అనే పేరుతో ప్రపంచమంతటా ప్రసిద్ధిగాంచింది.

ఈమె గనులలో పనిచేసే ఒక కార్మికుని కుమార్తె. గనిలో పనిచేయు కూలీ భార్య. కార్మికులుపడే అవస్థలు ఆమెకు తెలుసు. కార్మికులు చేసే త్యాగం — బలి-కూడా ఆమెఎరుగును.

ఆస్ట్రియన్ పార్లమెంటులో గనుల కూలీల తరఫున మెంబరుగా ఉండేది. ఇపుడు స్పెయిన్ లో కమ్యూనిస్టు పార్టీకి నాయకత్వం వహించింది.

ఆమె పోరాటాలలో, జయాపజయాలలో కార్మికోద్యమంలో అనుభవం గడించుకొన్నది. ప్రజాస్వామిక స్పెయిన్ మూర్తీభవించిందామెలో, ప్రజా వాంఛను ఆమెకంటె ఎవరూ ఎక్కువ అర్థం చేసుకోలేరు. ఆమెను ప్రజలిచ్చే గౌరవానికి ప్రేమకు మరొకరు తగరు.

మన మీ వీరనారీమణిని — కామ్రేడ్ను — అభినందించుదాం. మనం సగర్వంగా "సాల్యూట్ పాషియోనారియా" అని అందాం.

౧౯౩౪లో ఆస్ట్రియన్ మైనర్ల (గనిలో పనిచేయు కార్మికులు) తిరుగుబాటును నాశనము చేసిన క్రూర దినాలకే ఆమెను కలసికొన్న నాటి ఘటనను మరచిపోలేను. ఆమె ప్రజలకు జరిగిన భయంకర అఘాయిత్యాలను గూర్చి, ఆవేదనాగ్నితో వ్రాకుచ్చింది. మళ్ళా ఎప్పటికైనా ఒక సారి విజృంభించి పోరాడగలరని ఆమెకు విశ్వాసమున్నట్లు తెల్పింది.

మళ్ళా మేము అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ ౭వ కాంగ్రెస్ సమావేశంలో కలిసికొన్నాము. ఆస్ట్రియాలో ౧౯౩౪లో జరిగిన నిరంకుశ చిత్రవధల తర్వాత సోవియట్ రష్యాలో రక్షణపొందిన ఆస్ట్రియా వీరులు స్పెయిన్లో యుద్ధం చేశారు. ఈ వీరులంతా కాంగ్రెసును అభినందించుతూ వెల్లడించిన హర్షధ్వానాల్ని మే మిద్దరం ఒకే ప్లాటుఫారం మీద కూర్చొని విన్నాం. కనులయందు ఆమె ప్రత్యక్షంగా గోచరిస్తున్నది. "దృఢంగా తిన్నగా నిలబడ్డ వ్యక్తి — ఆ కళ్ళలో కన్నీళ్ళు — పిడికిలిని ముడిచిన ఆ చేతులు — యోధులైన తన కామ్రేడ్సు ఆ హాలుగుండా నడుస్తుంటే గర్వం" — ఇంకా ఆమూర్తి నా కళ్ళయందు నాట్యం చేస్తున్నవి.

౧౯౩౬లో పీపుల్సు ఫ్రంటుకై చేయవలసిన ఆందోళన గూర్చి చెప్పిన మాటలను ౧౯౩౬లో జనరల్ ఎలక్షనులలో విజయాన్ని గురించి ఆమెజెప్పిన భవిష్య ద్వాణి నేనింకా మరచిపోలేను. ఆనాటి విజయమంతా పాషియోనారియా యొక్క నాయకత్వం వలననే. ౧౯౩౬ జూలైలో ఫ్రాంకో విద్రోహం లేవదీయగానే ఈ వీర నారీమణి ముందున్న కరక్ మూరులను ఫేసిస్టుల నెదుర్కొంటానికి ప్రజా సామాన్యాన్ని ప్రోత్సహించేసింది. జులై-ఆగస్టు సెప్టెంబరు, క్లిష్టమైన ఆ మూడు మాసాలలో ఆమె ప్రజలను ఎలా ఉత్సాహపరిచిందో, ఉద్రేకపరిచిందో ఆమె ఉపన్యాస ధోరణిని పత్రికలలో చూచాం.

ప్రపంచ మంతటా ఆమెయొక్క — "నో-పాసరాన్" (దాను అతిక్రమించరాదు) అన్న నినాదం, ప్రతిధ్వనించింది. నాగరక ప్రపంచానికంతటికీ ఇది మృత్యువులేని నినాదం. ఈ నినాదమే ఆమెపేరుగా మారింది. ఆ ప్రథమ అపాయ సమయంలో ప్రజలు ధైర్యంగా విద్రోహాన్ని ఎదుర్కొన్నారు. యావత్ దేశం యుద్ధంగా మారిపోయింది. పాషియోనారియా ఎప్పుడూ అలసట చెందలేదు. సైనిక నాయకత్వ ఐకమత్యాన్ని, యుద్ధ పరిశ్రమల ఉత్పత్తిని గొప్ప జన సామాన్య సైనికదళ నిర్మాణమును జయప్రదం గావించడానికి ఆమెపడిన కష్టాలు - ఎదుర్కొన్న సమస్యలు ఇన్నిన్ని గావు. ద్రోహులను నాశనం చేయడంలో కూడ ఎడతెగకుండా పనిచేసింది.

బాంబులవేయడం. స్త్రీలను పిల్లలనుచిత్రవధ గావించడం, అమూల్యములైన కళా సంపత్తును నాశనం గావించడం, ఆహారం క్షీణం తక్కువగా పడం, తల దాచుకోదలచిన వారి పాట్లు, ఆమె కనులార గాంచింది:

కాని పాషియోనారియా కష్టాలకు లొంగలేదు. విజయానికి అవసరమయిన పునర్నిర్మాణ కార్యాన్ని ద్విగుణీకృతోత్సాహంతో కొనసాగించింది.

ఒక సంవత్సరం క్రిందటి ప్రభుత్వ సైన్యంతో ఈనాటి సైన్యాన్ని పోల్చి చూచినచో స్పానిష్ ప్రజల అమృత జయయానికి ఆమె గర్వపడాలని మనం గుర్తించుతాం. ఈసంవత్సరం స్పానిష్ పార్లమెంటులో అక్టోబర్ ౧,౨ వ తేదీలలో స్పెయిన్, కమ్యూనిస్టుపార్టీ తరఫున, కొటలోనియా యునైటెడు సోషలిస్టు పార్టీ తరఫున ఆమె యిచ్చిన మరపునకు రాని ఉపన్యాసంలో ఆమె నాయకత్వంయొక్క మహత్తర శక్తులలోని ఉద్రేకం కనిపించింది. నేనామె ఉపన్యాసాన్ని అంతా చెప్పాలని తలుస్తాను, కాని ఈక్రింది కొన్ని వాక్యాలు సరిపోతవనుకొంటాను:—

"సియిరా"యొక్క కష్ట దినాలలో సైనికులతో కూడ మొట్టమొదట వెళ్ళిన మాకు, "గా-డాలాజరా, బ్రూనెట్, బెల్చైటు"ము నలగు నాటికద యుద్ధదినాలలో సైనికులలో నూతనుండిన మాకు. పెద్దసైన్యం లేదు. కాని దుశ్మాను ఎలా పోరాడాలో-జయించాలో తెలిసిన సైన్యం ఉన్నది. శత్రువులనుండి భూమిని లాగుకొనేటటువంటి, శత్రువుల పైదాడి సల్పేటటువంటి, పట్టణాల వశపరచుకోవడం తెలిసినటువంటి. ప్రభుత్వానికి ఒక వారంలో ౪౦౦ చదరపుమైళ్ళ భూమిని సంపాదించినటువంటి, సైన్యం మాకున్నది. ఈ సైన్యం పార్టీలకు, సంఘాలకు ప్రభుత్వానికి ఒక సమస్యను ముందుపెట్టింది. ఈ సమస్యను మనం వదలివేయలేము. ఆ సమస్యకు తగిన ప్రాముఖ్యత ఈయాలి. ఆ సమస్య "రిజర్వు సైన్యముననుంచుట" గూర్చి... రిజర్వు సైనికులనుంచడంవల్ల ప్రభుత్వం మరొక సమస్యను ఎదుర్కొనాలి. అది ప్రభుత్వంకూడా గుర్తించేఉంది. కాని మనం మనదృష్టిని ప్రసాదించవలసిన విషయం యుద్ధసామగ్రియొక్క ఉత్పత్తినిగూర్చి. ఈవిషయంలో మనకేమీ లేదు మనమెంతో చేయాలి. మన ఫ్యాక్టరీలు శత్రువులతో పోరాడి సల్పడానికి తగినంత సామగ్రిని తయారు చేయడానికి పూనుకొన్నవి. శత్రువులతో తగురీతి పోరాడటానికి అవసరమగు సామగ్రి తయారుచేయ మొదలుపెట్టింది విమానాలు తయారుచేసే ఫ్యాక్టరీలు మన కున్నాయి. ప్రజ లీవిషయం గుర్తించి ప్రభుత్వంలో విశ్వాస ముంచాలి...యుద్ధ సామగ్రి తయారు గావించడంలోను, తదితర శాఖలలోను తమకుటుంబాలు పోషించుకొనేందుకు తగినంత జీతాలు ఇవ్వలేక పోతున్నారు. మనము ఎప్పుడో ఆని వృద్ధిని దూరంగా చూపించడంకంటె వెంటనే ఆచరణీయమైన సదుపాయం ఏదో ఒకటిచేసి స్పెయిన్లో ఏదో ప్రధానమగు మార్పు వచ్చిందని కార్మికులు గ్రహించేటట్లు చేయాలి.

మనం యుద్ధ రంగంలో ఉన్నాము. మనకు దయకు తావులేదు శత్రువునకు దయలేదు. గాబట్టి శత్రువు శత్రువే. అతన్ని శత్రువుగానే వ్యవహరించాలి. మన శత్రువుల్ని చీడ పురుగుల్లా విదల్చిన కొలదీ మన విజయం నిశ్చయమవుతుంది...

ప్రజలలో విశ్వాసం ఉండాలి. జయం పొందాలని దృఢమనస్కులైన మన ప్రజలలో ఎవంకీ తీసిపోని విశ్వాసం ఉన్నది. కాని మన ప్రజలు పోరాడే శక్తులలోకూడ మనకు విశ్వాసమున్నది. మనము ప్రజలను తమ ఆశయాలను సంపూర్ణ మొనర్చు వారి యెడల విశ్వాసముంచునట్లు చేయాలి. స్పెయిన్ స్వాతంత్ర్యమును, న్యాయమును జయించేందుకు ప్రతి క్షణాన తాము బలి అవడానికి తయారుగానున్న సంస్థలయందు విశ్వాస ముంచాలి..."...వాతావరణాన్ని చెడగొట్టడానికి నీలాప నిందల వార్తల వ్యాపింప చేసేవారికి విరుద్ధంగా ఒక మాట చెప్పడం అవసరం. శత్రువులతో రాజీ పడడం అనేది అసంభవం. వర్గాలవలె సిగ్గుపడదగిన లొంగుబాటు ఉండనేరదు. ఒకే ఒక విధానం ఉంది మనకు. అది ఫ్రాంకోను నాశనం గావించడం.

అధ్యక్షా, ప్రతినిధులారా, 'సోదరులారా: ప్రజాస్వామ్య పార్లమెంటరీ ప్రభుత్వానికి, ప్రజల స్వాతంత్ర్య సిద్ధికి ప్రజాస్వామ్య రక్షణకు, ఫేసిజంను ఓడించడానికి, అచంచలమైన దీక్షాపరతతో కమ్యూనిస్టులమైన మనం పాటుబడతాము."

ఆ మాటలు ఆమెవి కావు. స్పెయిన్ ప్రభుత్వమే మూర్తీభవించి మాటాడుచున్నది,

ఈ సంవత్సరం పారిసులో నవంబరు ౩౦ వ తేదీన పాషియోనారియాను కలిసికొన్నపుడు బ్రిటన్ ప్రజలు గావించిన దానికి ఆమె ప్రజలు ఎలా సంతసించారో తెలిపింది. మన దేశపు కామ్రేడ్సు స్పెయిన్లో చనిపోయారు గదా! వారి కుటుంబాలకు తన సానుభూతిని తెలియజేయమని ఆమె చెప్పింది. "ఈత్యాగం బలి ఊరికే చచ్చిపోదు. ఫలితం ఉంటుంది." అని ఆమె అన్నది." బ్రిటిష్ కామ్రేడుల ధైర్య సాహసాలు నాకు తెలుసును. కామ్రేడు పాలిటు, బ్రిటిషు ప్రజలను ఇంకా తగిన సహాయం చేయమని అడుగు. మాకు ఆహారం కావాలి. పిల్లలకు పాలు కావాలి బట్టలు కావాలి. మేము జయించక తప్పదు. త్వరగా సహాయం చేస్తే విజయం త్వరలో లభిస్తుంది. బ్రిటిషు ప్రజలచే ఒత్తిడి గల్గించి, ప్రభుత్వం ఫ్రాంకోకు సహాయం చేయకుండా చేయాలి. అంతర్జాతీయ కార్మికోద్యమంలో సఖ్యత ఏర్పడి, సంయుక్తమైన ఆందోళన మాకై చేసేందుకు విదల్చిన త్వరంగా పనిచేయి." అని ఆమె నాతో అన్నది.

నేను పాషియోనారియా చేయిలో చేయివైచి మేమింకా సహాయం చేస్తామని కామ్రేడ్సు! మీపేరిట- వాగ్దానం చేశాను.

పాషియోనారియాకు ఈనాడు జన్మదినోత్సవ అభినందనాలు తెల్పుట అంటే ప్రజాస్వామ్య స్పెయిన్ ప్రభుత్వ విజయానికి మన శక్తినంతా ధారపోస్తామని చెప్పడమే అని అర్థం.

పాషియోనారియా విస్ఫ్రుహతో నిరాశలో కృంగలేదు. ఆమె ధైర్యాన్ని సాహసాన్ని. విశ్వాసాన్ని ప్రోత్సహించుకొంది. మన ప్రోత్సాహంతో విజయం త్వరగా తప్పక సిద్ధిస్తుంది.

కామ్రేడ్సు. మన మాంసంలో మాంసమై, బొమికలో బొమికయైన ఈ వీరవనిత మనలో నుంచిన విశ్వాసాన్ని పోగొట్టకండి.

తక్కిన స్త్రీలందరూ ఆమెను అనుకరించడంలో గర్వించాలి. ఆమె స్పానిషు కార్మికులు-కాదు కాదు-ప్రపంచ కార్మికులందరియొక్క నాయకురాలు.

ప్రజాస్వామ్య స్పెయిను ప్రభుత్వం విజయం పొంద దృఢ మనస్కయై ఉన్నది. అది జయించక తప్పదు.

పాషియోనారియా! మగల ఇంకోసారి మా అభినందాల నర్పించుచున్నాం. చరిత్రలో నారీవీరులలో అందరికంటె ముందు నీపేరు లిఖింపబడుతుంది మా పిడికిళ్ళు బిగించి సగర్వంగా "సాల్యూటు, రిపబ్లికన్ స్పెయిన్. విజయము నీది—మాది"అని అంటున్నాం, ఈ గీతిక ప్రపంచమంతా ప్రతిధ్వనించాలి:—

ప్రపంచ కార్మికులారా!
వినండి మరి కలవండి!
మన విప్లవ జ్యోతిని
ధగద్ధగాయమానముగ నిల్పండి!

ఈ భయద నిశీధిలో
విప్లవ జ్యోతిలో సాగండి!
జయించలేరా-జయించరాదూ!
వారిక అణగిడరాదూ!

# అత్రాఫుబల్దాజిల్లా రైతులదీనావస్థ

## గత్యంతరములేక దేశత్యాగమునకు నిశ్చయించుట

## క్షామబాధితులు శిస్తుమాఫికి ప్రభుత్వమును ప్రార్థించుట

(గోలకొండ విలేఖరి)

బొల్లేపల్లి మార్చి ౩౧

అత్రాఫుబల్దా జిల్లాలో చేరిన బొల్లేపల్లి, నందనం, నాగురెడ్డిపల్లి, సోమవరము, పొద్దుటూరు మొదలగు గ్రామముల క్షామబాధిత రైతులు పంటలు పూర్తిగా నశించిపోవుటయేగాక అన్నాకారము లేక మిగుల చుచున్న పశుక్షోభ గాంచలేక రబ్బీశిస్తు మాఫికై ప్రభుత్వమువారికి పంపిన దరఖాస్తునందలి విషయము లుల్లేఖించవలయు రూఢిగా తెలియుచున్నది.

సకాల వర్షములు లేనందున పంటలు పూర్తిగా నశించెను. (గష్తినిషాక్ ౧౩౪౭ సన్ ౧౩౪౭ ఫ. సాలు ప్రకారము) అధికారులు సరిగా పరిశీలించిన రైతుల దుర్భరవిషయములను తమ రిపోర్టుద్వారా పైఅధికారులకువివిశదపరచియుండిన, రబ్బీపురాన రెండుశిస్తులకుకూడ కొంత మాఫీ దొరకియుయుండెడిది. అధికారుల రిపోర్టులేని కారణమున రైతులుగత్యంతరము లేక శిస్తులు చెల్లించవలసినవారైరి.

రబ్బీపంటలు పూర్తిగపోయినవి. విత్తనములు యితరసేద్యపు ఖర్చులు సాహుకారీవద్ద అప్పుగా తెచ్చుకొనిరి. కాటికి వెలమలమాడుచున్న రైతులు ఋణములు చెల్లించజాలకుండుటచే సాహుకారులు ముందు ఋణమొసగుటలు లేదు. పశువులకు మేతలోపించినది. పశువులు జీవించు వాశయుడినది. ఈదుర్భరస్థితిలో రైతులకు దేశాంతరమే ముక్తిదాయకముగా పరిణమించినది.

ఆంధ్రజిల్లాలలో ముఖ్యముగా నల్లగొండ, మహబూబునగరము అత్రాఫుబల్దా జిల్లాలలో పరిస్థితు లిటులేగలవు. పైజిల్లాలో క్షామసూచన లగుపడుచున్నవి. జనులు గ్రామములు విడిచి పోవుచున్నారు. ఈపరిస్థితులవలన దేవరకొండ తాలూకాలో రూపాయికి ౨ అణాలు బరాయించ నొసగబడెను. కొబట్టి ప్రభుత్వమువారు రబ్బీశిస్తుకు పూర్తిగామాఫీనొసగి ముందు రైతులకు తకావిద్రవ్యసహాయమునొసగుటకై రైతులు ప్రార్థించిరి.

## వైశ్యవితంతు వివాహము

(గోలకొండ విలేఖరి)

సిద్దిపేట, మార్చి ౩౧

౨౭ మార్చి తేదిన గ్రామమండలి శరభేశ్వరాలయములో జాలూరి శరభలుగారి కుమారుడగు శంకరయ్యకు జల్లెల గ్రామవాసియగు బంద్రం హనుమయ్యగారి విళ్ళెంతుకూతురగు మణెమ్మకు వివాహము నూరరామన్నగుప్తగారియాధ్వర్యమున అతివైభవముగా జరిగినది.

ఈప్రాంతమునందిది ప్రథమవివాహమైనను వైశ్యోద్ధారక సమాజమువారి సత్ప్రచారమువలన గ్రామవాసులేగాక పరిసరప్రాంతములవారసేకులు ఉత్సాహముతో పాల్గొనిరి.

వివాహసందర్భమున దేవాలయమునందు జరుపబడిన విందునందు నేకులు వర్ణపూర్వకముగా పాల్గొనిరి.

వధూవరుల ఛాయాగ్రహణానంతరము వాయిద్యములలో గ్రామమునం దూరేగింపు జరుపబడినది.

ఈ నూతనసంస్కార వధూవరులకు సౌఖ్యము నొసంగుగాత!

## జాగీరు రైతులకు ముక్తికలదా?

(గోలకొండ విలేఖరి)

అనంతవరము, మార్చి ౩౧

ఇది పర్గతాలూకాలోని జాగీరుగ్రామము. జాగీరురైతులు జాగీర్దారులగారి నిరంకుశపాలనకు లోనైయుండుటవలన వీరిస్థితి ఖాల్సాయి లాకా రైతులకన్న యెంతహీనముగా, దుర్భరముగానున్నదో దేశీయులకు పాఠకులకు నూతనముగాదు. ప్రభుత్వమువారివద్ద వీరిమొర లాలకింపబడకుండుటచేతనే నాటికి జాగీర్దారుల అన్యాయములు, దౌర్జన్యములు మితిపోవుచుండుట సహజము. దేశసేవకై కంకణములు ధరించిన నాయకులు తమ దివ్యదృష్టిని ఖాల్సా రైతులవైపు ప్రసరించుచుండుట మరింతచిత్రము గాగలదు. పరమేశ్వరుడు వీరి యుద్ధారణబుద్ధికి "జాగీరు రైతులు తోడి మానవులు. వారి అభ్యుదయముకై కృషిసలుపు టత్యవసరము" అను భావమెప్పుడు స్ఫురింపజేయనున్నాడో!

ఇచ్చటి జాగీర్దారు గారివలన జరుపబడుచున్న అక్రమములు, అన్యాయములు, మితిమీరిన పన్నులభారములు భరించలేక రైతుక్షేమమే అదర్శప్రాయముగానిర్ణయించుకొనినతప్రభవహసన్నవారికి రైతులుతమకష్టనిష్ఠురములు వ్రాతమూలముగా విశదపరిచినటులను, నివారణమార్గములు విదితపరచుటకు కోరినటులను రూఢిగా తెలియుచున్నది. మహాసభవారేపద్ధతుల నూటించెదరో, ఎటుల వీరల దరికిచేర్చెదరో అని రైతులు నిరీక్షించుచున్నారు.

## పశుబలి వేదసమ్మతమా?

(ఒక విలేఖరి)

ధర్మపురి, ఏప్రిల్ ౧

ఇది జగిత్యాలకు ౨౦ మైళ్లదూరమున గల యాత్రాస్థలము. ఇచ్చట సుమారు ౫౦౦ బ్రాహ్మణుల గృహములుగలవు. ఈమాసమునందు యిచ్చట (చైత్రశు॥ ౧౧ భౌమవారము) శ్రీసంగనభట్ల నరహరి దీక్షితులవారి యాజమాన్యమున యజ్ఞము జరుపుటకు తీవ్రముగు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈయజ్ఞమునందు పశువధ జరుపబడును. నాలుగుమేకలు వధగావింపబడనున్నవి. ఇదివేదసమ్మతమట. పిష్టజీవిగాక సజీవ జంతుయాగము జరుగనున్నది. దీక్షితులుగారు పశువధ వేదహితమని ఆర్యసమాజికులతో ఋజువుపరచుటకు కంకణబద్ధులైయున్నారు.

కొబట్టి యీ సుసమయమున శ్రీ నరేంద్ర వంటి ఆర్యసమాజక ప్రచారకులు, జీవరక్షాజ్ఞాన ప్రచారకమండలివారు, అభివృద్ధిపక్షమువారింతవరకు విచ్చేసి గ్రామమునందు చక్క ప్రబోధ మేర్పరచిన యెంతయోమేలగును. జీవహింస వీరి ప్రబోధమువలన ఆగిపోవు నాశగలదు.

హుమ్నాబాద, మార్చి ౩౧

౨౭ మార్చి తేదిన విపరీతమగు వర్షము కురిసినది. చెట్టుపై పిడుగుపడినందున రెండుభాగములుగా చెట్టు చీలిపోయినది. ఒకభాగము క్రిందకూలినది. ఇరువురుస్త్రీలకు గాయములు తగిలినవి. ప్రాణనష్టముమాత్రము కలుగలేదు.

మాణిక్యనగరమునందు ఏకముఖి స్థాపిత మార్తాండ మాణిక్యప్రభువులగు ఖండేరావు మహారాజు గారి అభిషేకోత్సవ మతివైభవముగా దిండీయుత్సవముతోసహ జరిగినది. దూరదూరప్రదేశములనుండి భక్తులనేకులు వచ్చి దర్శించిరి. ఎట్టి అల్లరులు లేక జరిగినందులకు సంతోషము.

## కల్లుత్యాగకున్న చాలా నా?

(ఒక విలేఖరి)

హనుమాపురం ఏప్రిలు ౧

అభివృద్ధిపక్ష యువకుల తీవ్రకృషివలన ఈ గ్రామమునందు మద్యపానము చాలావరకు తగ్గినది. ప్రజలలో చక్కని ప్రబోధమేర్పడుటచే నిషేధకార్యము విజయవంతమైవదన వచ్చును. ప్రజలయందేర్పడిన యీ మనోనిశ్చయము కల్లువ్యాపారస్థులగు గౌడులకు కంటకముగా పరిణమించినది. ఈగ్రామమందలి గౌడులు తమవ్యాపారము పూర్తిగా అడుగంటు చుండుట గాంచి ప్రచారకులపై దౌర్జన్యపద్ధతులవలంబించుచున్నారు. ఇంతేకాదు. ఈ గౌడులు భువనగిరినుండి అబ్కారి ముంతజం దఫేదారు,పోలీసు భటులను గ్రామమునకు స్వంతవ్యయముతో మోటారులో తీసుకొనివచ్చిరి. గౌడులాతరికిరుచితము గారిల్లుబోసి వారివాజ్మూలము అధికారులకిప్పించిరి. శిద్దుల అక్కిరాజు నారాయణ, యేమకనీతియ్య సారి నేని నారాయణ, శిద్దుల బాలయ్య, బొమ్మయిస్వామి, చాకలిరాజయ్య మొదలగువారిపేరులు నోటుచేసుకొని వారివారి వాజ్మూలములు గైకొనకుడునని అధికారులు చెలిపిరి వీరందరిని చాలాచేయించెదమని అధికారులు గ్రామపెద్దట్టుల గలదు

అధికారులు వచ్చిననాటినుండి గౌడుల దౌర్జన్యపద్ధతులు మితిమీరిపోవుచున్నవి ప్రచారకులుమాత్ర ముత్సాహముతో పని సలుపుచున్నారు.

## మందిరవిస్తారణ నిధి

హైదరాబాద ఎప్రిల్ ౧

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము యొక్క మందిరవిస్తారణనిధికి శ్రీ శ్రీ రాణీ సంశాదేవిగారు వనపర్తి సంస్థానాధిపతులు రు ౨౦౦ భూరివిరాళమును వాగ్దానము చేసిరని తెలుపుట కెంతయు సంతసించుచున్నాను. శ్రీరాణీసాహెబాగారి ఆంధ్రభాషాభిమానమునకును ఔదార్యబుద్ధికిని ఇది గొప్పనిదర్శనమని వేరే చెప్పనేల. శ్రీ రాణీగారి విరాళము మంచి అవసరసమయమందు లభించుట మరి సంతోషావహము. మానిధి ఇంకను లోటుపాటుగానున్నది ఈ కార్యములో సంస్థానాధిపతులందరు ఇట్లే మాకు అండయై నిలుతురని కోరుచున్నాను శ్రీ రాణీ సరళాదేవి గారికి కృతజ్ఞతా వందనములు.

ఈనిధికి అడిగినంతమాత్రముననే రు ౨౫ విరాళము ధనరూపమునపంపిన శ్రీ గూడా రామారావు పంతులు గారికిని, అట్లే రు ౨౫ విరాళము ధనరూపమున ఇచ్చిన శ్రీ నిజాంరాష్ట్ర ఆర్యవైశ్య మహాసభా కార్యదర్శి పు రా. శ్రీ వేలూరు వీరభద్రయ్య గారికిని మా హృదయపూర్వకవందనములు. కార్యదర్శి.

## పొరపాటు

సికింద్రాబాదు, ఏప్రిలు ౩

౧౨-౧-౩౮ తేదీని ప్రకటింపబడిన గోలకొండపత్రికలో నాచేవ్రాయబడినవ్యాసమున వ్యాకరణబోధినియను గ్రంథమున కొన్నిదోషములు చూపబడినవి. పిమ్మట నామిత్రులగు ఆదిరాజు వీరభద్రరావుగారు నా కవిదోషములుగావని నాపొరపాటుని నిరూపించిరి. వారు తెలిపినయంశములకు నాకు తృప్తికలిగినది.

ఆ వాదమున్నను నేనుపసంహరించుకొనుచున్నాను. వీరభద్రరావు గారికి నా కృతజ్ఞతాపూర్వకాభివందనములు. గ్రంథప్రకాశకులకు క్షమార్పణమును సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు తెలుపుచున్నారు.

—


# గోలకొండపత్రిక

బహుధాన్య నామ సం॥ర చైత్ర శు॥ ౪

సోమవారము


## పత్రికాప్రతినిధులకు సౌకర్యములు

ఇటీవల మదరాసు రాష్ట్రము నందు కొందరు పత్రికాప్రతినిధులు తమకు ప్రభుత్వ ముఖ్యాధికారులనగ్గ తగిన సౌకర్యములు లభించుటలేదని మొఱపెట్టగా, ప్రభుత్వమువారు పత్రికాప్రతినిధులకు కావలసిన సౌకర్యముల నొసగుటకై చేయబడినఏర్పాట్లను విశదపరచుచు నొక కమ్యూనిక్కును ప్రకటించినారు. అది చాలాముఖ్యమైనది. పరిపాలనయందు భాగస్థులగు ప్రజాప్రతినిధులతోగూడిన సంస్థలబలము ఎక్కువగా నుండు రాష్ట్రములకేగాక, అట్టి సంస్థల బలము లేనిరాష్ట్రములకుగూడ, ఈఏర్పాట్లవలన కలిగెడి ప్రయోజన మొకటిగలదు.

మదరాసు ప్రభుత్వమువారు ముఖ్యముగ వార్తాపత్రికలకు తోడ్పడుటకే, ప్రచురణశాఖ నొకదానిని ఏర్పాటుగావించియున్నారు. ఈశాఖ ప్రభుత్వము తలపెట్టుచున్న పనులను, వివిధ విషయములలో ప్రభుత్వమువారి విధానమును, వైఖరిని తెలియజేయుటకై పత్రికలద్వారా ప్రకటనలను జేయుచుండును. కాని, ఈప్రచురణశాఖయొక్క అందుబాటు తఱచుగా, రాష్ట్రప్రధాన నగరమందుండు పత్రికాప్రతినిధులకుమాత్రమే ఉపయోగించుచుండును. దూరమునజిల్లాలలోనుండు అధికారులవలన పత్రికాప్రతినిధులు ఎప్పటికప్పుడు సకాలమున తెలిసికొనదగు విషయములనేకములుండును. వాటినిగూడ ప్రధాన నగరమందలి ప్రచురణశాఖద్వారానే తెలిసికొనుట యనిన, ప్రభుత్వవార్తల ప్రచురణములో అసహ్యమైన ఆలస్య మేర్పడగలదు. కనుక మదరాసు ప్రభుత్వమువారు జిల్లా కలెక్టరులకును, జిల్లాపోలీసు ముఖ్యాధికారులకును, కార్య నిర్వాహకశాఖలోని ఇతర ముఖ్యాధికారులకును, న్యాయ నిర్వహణాధికారులకునుగూడ తమ తమ కార్యాలయములయందు వార్తాపత్రికల ప్రతినిధులకై ఒక ప్రత్యేక కాలమును నిర్ణయించి, ఆసమయమందు వార్తాపత్రికల ప్రతినిధులు తమనడిగి సరియైన వార్తలను తెలిసికొనిపోవుటకు అవకాశమొసంగుటకు అధికార మొసగబడినదని ఇప్పుడు కమ్యూనిక్కులో వెల్లడిచేయబడుచున్నది. తుదకు స్థానికస్వపరిపాలన సంస్థల కార్యక్రమముగూడ పత్రికల ప్రతినిధులు కోరినపుడు వాటికందజేయవలెనని ప్రభుత్వమువారు సూచించినారు. ప్రభుత్వాధికారులు తాము ప్రకటనకిచ్చువార్తల యథార్థతకు బాధ్యులుగనుండునట్లు చేయబడుట ముఖ్యముగా గమనించదగినది. ఇట్టి సత్యములైన వార్తాంశములనుమాత్రము, ఎట్టిఅభిప్రాయవిమర్శలతో చేర్చకుండ పత్రికలకు అందజేయుటకు తోడ్పడుట తమవిధానమని నేటివైస్రాయి లిన్లిత్గోగారు తమ అధికారమును స్వీకరించగనే బ్రాడ్కాస్టు ఉపన్యాసమందు స్పష్టముచేసియుండిరి.

మన ని. ఘ. ప. నిజాం ప్రభుత్వమువారును ప్రత్యేకముగ ప్రచురణశాఖనొకదానిని నేర్పాటుచేసియున్నారు. ఈ శాఖచే పత్రికలకును ప్రభుత్వమునకును, మధ్య నానాటికి సంబంధము వృద్ధియగుచున్నది. ఇది సంతోషమేకాని ప్రభుత్వమునకు సంబంధించిన వార్తలను కోరెడి పత్రికాప్రతినిధులకు తెలియజేయుటకు ఇతరప్రభుత్వ ముఖ్యాధికారులకు అధికారమును ప్రభుత్వమువారొసగవలెను. అన్నిజిల్లాలలోను వివిధ ముఖ్యశాఖాధికారులందరి విషయములోను ఇట్టి ఏర్పాటు ఉండుట అవసరము. జిల్లాలలో నివేదికరులకు ప్రభుత్వోద్యోగితో సంబంధించిన ఒకవార్తనుగూర్చి తెలియగానే, దాని సత్యాసత్యములను నిర్ణయించుకొనుటకు ప్రభుత్వాధికారులు తోడ్పడవలెను. ఇపుడు మన రాష్ట్రమందిట్టి పరిస్థితి లున్నవనుకొనజాలము. సాధారణముగా జిల్లాఅధికారులకును, పత్రికల ప్రతినిధులకును, అపేక్షణీయమైన సహకారము అరుదైయున్నది. త్వరలోమన రాష్ట్రమందును ప్రజాప్రతినిధులకు పరిపాలనయందు బాధ్యతనొసగు రోజులు వచ్చుచున్నవి. గనుక ఇట్టిపత్రికాసౌకర్యముల ఏర్పాటులవసరము స్పష్టపడగలదు అప్రజా ప్రతినిధులకు పరిపాలనయందు బాధ్యత నిచ్చువిషయమెట్లున్నను, పరిపాలనకు సంబంధించిన సత్యములైన వార్తలు పత్రికలద్వారా ప్రజలకు తెలియుచున్ననేగాని పరిపాలన సంపూర్ణ బాధ్యతాభావముతో సాగజాలదు.

—

## హరిజనుల సౌకర్యములు

మదరాసు శాసనసభయగు అసెంబ్లీలో పోయిన మార్చినెల ౨౯ తేది నాడు రావుబహద్దర్ యం. సి. రాజాగారు "హిందువులలో కొన్ని తెగలవారలకు గల సాంఘిక అసౌకర్యములను తొలగించుటకై" ఒక చిత్తుచట్టమును ప్రవేశపెట్టుచు దానిని సెలెక్టు కమిటీ విచారణకు పంపవలెనని ప్రతిపాదించిరి. ప్రతిపాదనకు సభలోని అన్నిపక్షముల వారలును అనుకూలముగ అభిప్రాయమిచ్చిరి. తుదకు ప్రభుత్వముపక్షమున శ్రీయుత రాజగోపాలాచారిగారును ప్రభుత్వమువారు ఈశాసనమువెడ అనుకూలాభిప్రాయము కలిగియున్నారని చెప్పిరి.

హరిజనులు హిందువులుగా నున్నందుకు వారలు సంఘమందు ఇతరులతో సమానముగ ప్రాథమికములైన హక్కులనుకూడ అనుభవించ జాలకపోవుట మిక్కిలి అన్యాయము. ఇట్టి అన్యాయము తొలగించబడు నంతవరకు దానిని తొలగించుటకు ఎన్ని మంచి మార్గములున్నవో వాటి నన్నింటిని అవలంబించుట ప్రజాసేవకుల విధి. శ్రీయుత రాజగోపాలాచారిగారు చెప్పినట్లు ప్రాథమికములైన హక్కులలో గూడ కొన్నిటిని హరిజనులకు సమకూర్చుట నేడుకూడ సులభమైనపని కాకపోవచ్చును, ఇట్టిఉద్యమమునకుమతజో ధనసహాయ మున్ననేగాని అది జయించలేక పోవచ్చును. అయినను, శాసననిర్మాణమార్గముచే హరిజనుల సాంఘిక అసౌకర్యములను తొలగించుటకు వీలున్నపుడు, ఆమార్గమునుకూడ ఉపయోగించుకొనుటవలన హరిజనుల అభివృద్ధి ఎక్కువ వేగముగ జరుగగలదు.

ఇపుడు ప్రవేశపెట్టబడిన చిత్తుచట్టమునందు మతముతో ఎట్టిజోక్యముగాని లేదనియు, సవర్ణ హిందువులకు ఈ చిత్తుచట్టమువలన ఎట్టి ఇబ్బందులు కలుగజాలవనియు యం. సి. రాజాగారు చిత్తుచట్టమును అసెంబ్లీలో ప్రతిపాదించుచు చెప్పిన మాటను గ్రహించి, సవర్ణహిందువులందరును ఈచిత్తుచట్టముయొక్క విజయమునకు తోడ్పడగలరని నమ్ముచున్నాము.

—

## త్రిమూర్త్యాత్మకమైన

# నేటి యూరపు

## యూరపుఖండపు అంతర్జాతీయ రాజకీయాలకు హిట్లర్, ముసోలిని, ఫ్రాంకో కీలకాలన్నమాట

## ప్రపంచమందలి ప్రతిజాతివారికి ప్రాతినిధ్యముకలిగే నానాజాతిసమితి స్థాపించే దివ్యస్వప్నాలు కంటూవున్నాడు చేంబర్లేన్

"అరిబరీశుడు"

ఈరోజుల్లో యూరపు పెద్ద యుద్ధకొట్టలాగావుంది. యేవైపునుండైనా మిరుగురుపడినా భగ్గున మండిపోవాలిసిందే. తనేగాదు ప్రపంచాన్ని అంతా మండించే అపాయస్థితిలోవుంది. యూరపు దేశాలన్ని రెండు ప్రతికూలపక్షీయుల్లో యేర్పడుతున్నాయి. ప్రపంచమహాసంగ్రామానికి పూర్వం వున్నస్థితి యించుమించుగా తిరిగి తలెత్తింది. పేరుగాంచిన దేశాలు, జాతులు దాపకంలేక తమతమ కోరికలు విదితపరచాయి. బ్రిటన్ పాలసిమాత్రం అటో, యిటో యింకా నిర్ణయంకాని మధ్యస్థితియందుంది. అలాయెందుకుంది? అనే విషాయిన్ని గ్రహించాలంటే గీని చదివితీరాలి. యూరపురహస్యాలన్ని అవగహానం అయ్యేఅవకాశాలుచక్కగా వర్ణించబడ్డాయి.

యూరపురాజకీయరంగాన కొన్నినెలలనుండి కొత్తకొత్తయెత్తులు ఏర్పడుతూవున్నాయి ప్రభుత్వపద్ధతిలోనో, పరిపాలకవర్గములోనో, మంత్రాంగవర్గమునందో, క్యాబినెటుయందో మార్పుచెందనిదేశ మాఖండములో యేదైనా మిగిలివుందా అనే సందేహం నాకేగాదు పరివారికి కలుగుతూవుంది ఏమిటా కారణమని ఆలా నిష్పక్షదృష్టితో దిలకిస్తే యూరపుఖండములోని శక్తిసామర్థ్యాలు, బలాబలాలన్నీ రెండుగా ఏర్పడి మనోవేగ గమనంతో సర్వసన్నాహాలు జరుపుతూవున్నాయి. తాత్కాలిక సమరవిషయంలో ఫాసిస్టునాజీ పక్షాలకి అఖండంలో యెక్కువబలంయేర్పడివుందిఅనే వీలుంది. యూరపుఖండములోయేది ప్రజాసత్తాపాలనమనబడగలదో అదిమాత్రం అఖండపువీధుల్లో చాలా అరుదుగావుంది. అంతేగాదు దానిని ఆపేక్షించేవా రసలే లేరంటే చాలాసమంజసంగా వుంటుందనే నాభావం

ఫాసిజంలో నొకగొప్పసుగుణంవుంది. ఆ పేరుతో జరుపబడే ప్రతికార్యం అద్దంలాగా వుంటుంది: దానికి దాపరికంలేదు. దాని యుద్దేశం అదేశంగ్రహించటం ఆట్టే కష్టమైనపని కాదు, కాని, ప్రస్తుతం ప్రపంచంలో ప్రజాసత్తరాజ్యాలుగా వ్యవహరింపబడుతూవున్న రాజ్యాలు వచించేవిషయాలు, చెప్పేపద్ధతులు, సలిపేకార్యాలు గహనాతి గహనాలు. అణుమాత్రమైనా అవి బోధపడనీలు లేదు. అంటే క్లుప్తంగా ఫాసిజం బహిరంగంగాజరిగే యుద్ధమనుకోండి. ప్రజాసత్తరాజ్యాలంటే తమకార్యాన్ని తెరచాటునదాచే దాపకాలనుకోండి ఫాసిజం నేరుగా నిర్భయంగా తనగమ్యస్థానానికి రహదారినిఏటపోతుంది. రాజ్యాలు గమ్యస్థానానికి దోవవెతుకుతూవున్నాయి. ఫాసిజంతన యుద్దేశాన్ని విస్పష్టవిడిగా విపదీసి వుంచింది ప్రజాసత్తరాజ్యాలు మాయమందిరాల్ని నిర్మించుతూవున్నయి. ఇది యీరెంటితేడా

చరిత్రపుటలు తిప్పిచూడండి, వాటిమాటలో పనేమి, "నాకింకో సామ్రాజ్యంకావాలి. రోమన్ సామ్రాజ్యం నాకవసరం" అన్నాడు ఫెసిస్టు డిక్టేటరు ముసోలిని. అవుద్దేశంతోనే యీపిగాగ్రే పశుడు దయాదాక్షిణ్యాన్నివొదిలి అబిసీనియా నుజయించాడు. ప్రపంచంఅంతా గోలపెట్టినా "నేను వర్సలీసు సంధియందలి వ్యునిటిలిసెక్షన్ నుండివిముక్తికోరుచున్నాను" అనిఅన్నాడు. హిట్లరు నిర్భయంగా అణుమాత్రమైన తనయుద్దేశాన్ని బహిరంగపరిచేఅందుకు సంశయించిన పాపానపోలే. ఇంతేగాదు యీవిషయంలో వ్యవహారసలహాకోరలేదు. తాను స్వయంగా వర్సెయిల్సు సంధి దుమ్ముచేగకొట్టాడు. జర్మని రైన్ లాండుకు కోరుతూవుందని అంటూ జర్మనీసైన్యాన్ని రైన్ లాండుకు దింపాడు, ఆక్రమించాడు. జర్మన్ ప్రభుత్వానికేగాక, జర్మనీ సైన్యానికి యజమాని కావాల్సిందని హిట్లరు తనయిష్టం వెల్లడించాడు. సైన్యాధిపత్యము స్వయంగా గ్రహించాడు. స్పెయిన్ సంబంధంలో ప్రపంచమంతా గోలపెట్టిన లెక్కించక హిట్లర్ ముసోలిని జనరల్ ఫ్రాంకోను సాయంచేయాలని నిశ్చయించారు, చేసితీరారు. దీనితో యీత్రిమూర్తికికలిగినసఖ్యభావం, మిత్రత్వం స్నేహితం యన్నిహితసంబధంచూచి గత్యంతరం లేక బ్రిటను యీకోవపటకి తలొగ్గింది. యీముగ్గురుకలిసి యూరోపును మైకంయిచ్చి నిద్దురపుచ్చినట్లుంది పరిస్థితులు. ఫ్రాంసు క్యాబినెటు కూలింది, రూమేనియాలో "గోగా" మంత్రివర్గస్థానాన ముసలిపాదరి యొకడు రాజ్యంగానికొక్కడు ఆస్ట్రియాలో హిట్లర్ యుగం ఆరంభమైంది. షూషినిగ్ త్యాగంచేస్తమించాడు. జిబ్రాల్టరు స్పెయినుభాగమైనందున వెంటనే అప్పగించుమంటూవున్నాడు బ్రిటన్ను జనరల్ ఫ్రాంకో. మధ్యధరాసముద్రంలో ఫ్రాంసు, బ్రిటను యోడ అవూంతం ముంచివేయ బడుతూ, వున్నాయి. ఏవోకయుక్తులతో గాక మిట్టమధ్యాహ్నము చూసూచూమాచూండగా సముద్రదొంగలపేరుతోనో తెలపోతే బాంబుల ప్రయోగముతోనో ముంచివేయబడుతూవున్నాయి.

యూరపులో నానాజాతిసమితిపేరు యీచ్చరించేవా రొవహప్పుడుండేవారు. కాని, అది నానాటిదిన తంగా మారిపోయింది. యిప్పుడు మాత్రం అఖండంలో ప్రతివానినోట హిట్లరు, ముసోలిని, ఫ్రాంకోనే అంటె యీ త్రిమూర్తుల చేతుల్లోనే వుంది యూరపుఖండపుఅంతర్జాతీయ రాజకీయ కీలకమన్నమాట. నానాజాతి సమితిప్రథమయిర్పాడ్లో తయారుచేయబడింది, బ్రిటను యిటలీవైపు చేయిచాచి స్నేహితం చేసుకొంటూ ఆప్రథలో మేకుదిగేసింది, దాంతో అళవంలేచింది.

"బ్రిటన్ కు యిప్పుడున్న నానాజాతిసమితిపై అంతగా విశ్వాసములేదు. ప్రపంచశాంతిస్థాపన మే మాపరమోద్దేశం అయినందున దీనికిమారుమే మొక సమితిని నూతనంగా స్థాపించ నుద్దేశించాము. దానియందు కొన్నిప్రభుత్వాల ప్రతినిధులు గాక ప్రపంచమందలి అన్నిజాతులవారికి ప్రాతినిధ్యం ఎర్పరచుతాము. దానికే మేము ప్రాకులాడుతూవున్నాము" అన్నాడు ప్రధానమాత్యుడైన నెవిల్ చేంబర్లేన్. కానియిది ౧౫౫ ఆకాల నాలుగుకొండ్లు అసంభవముగా వుంది. ఇటలీ, జర్మని, జపాను, (బహుశః అమెరికా గూడ) "సమిష్టిసంరక్షణ" స్కీములకు సుతరామూ అంగీకరించే ఘటాలు యిమ్మాటికి గావు. అందుకని చేంబర్లేన్ గారి దివ్య స్వప్నాలు స్వప్నావస్థగాంచి వుండాల్సినవే. అంతేగాదు ఫాసిజం, కమ్యూనిజంమధ్య నిప్పులో పుప్పసంబంధంవున్నట్టు ప్రపంచమే దాపకంలేక సత్యం బలుకుతూ వుంది. కాబట్టి రష్యా యిటలీ, జర్మని స్నేహితంచేసే విషయం కేవలం అసంభవం.

ఫ్రాంసుకు, రష్యాకు సఖ్యం యేర్పడింది, వొడంబడికలు జరిగాయి. ఇది బ్రిటన్ కు ప్రాణకండంగావుంది. వొకవేపు యిది ఫ్రాంసుకు ఆప్తమిత్రుడిగా వున్నానని అంటూ రెండువేపు ప్రతికక్షియైన యిటలీతో స్నేహం చేయటానికి చేయిచాచుతూవుంది.దీనిఫలితం చూస్తేమాత్రం వొకవేళ బ్రిటన్ రష్యా ఫ్రాంసు స్నేహితం తటస్థించితే హిట్లరు, ముసోలిని ఫ్రాంకోపాట్లకి గర్భశత్రువుగా పరిణమించాల్సిందే. సందేహం లేదు. ఈశత్రుత్వం యింతటితో గాక జిబ్రాల్టర్ నుండి సూయజుకాలువవరకు ఫాసిస్టు ఆధిపత్యం స్థిరమైపోతుంది. దీన్తో బ్రిటిషువారి ప్రాచ్యసామ్రాజ్యాల సింహద్వారాలు మూయబడిపోరాల్సి వుంటుంది. అగ్నిగుండంలో దూకిన వానరంలాగా దీనికి యీదశ యేర్పడింది.

డిక్టేటరుల—నియంతల— చర్య అతివిచిత్రములనే రహస్యము బ్రిటన్ వృద్ధపాలకులో నే కనిపెట్టింది. వాండ్లు తమకోరికలు వాదవివాదాల్తో గాక బలముపయోగించిసాధించుతీర్తారు. అందుకే మేధావాలియైన చేంబర్లేన్ ఆలోచించి యేదో వాండ్లమొహాని కొంత్తనివరేకి వ్యవహారాల్ని అక్కడే పరిష్కరించుకుందామని సంప్రతింపులు మొదలెట్టాడు. ఇంతలో విదేశాంగ మంత్రియైన ఆంథోని యీడెన్ గారు కేబినెట్ నుండి జారిపోయారు. దీనితో యిటలీ బ్రిటన్ సంప్రతింపుల మార్గం నిరపాయమైంది, ఇహ ముందు వీరిద్దర్ ముసోలిని, చేంబర్లేన్ దీన్తో యేర్పడ్డ నవీనరంగాన యేం చేస్తారో, యెలా రంజింపచేస్తారో చూడాలి,

చేంబర్లేన్ తన ప్రధానామాత్య కాలంలో బ్రిటన్ కు చాలా అగౌరవంకలిగించి ప్రపంచంలో తలవంచించివేశాడని బ్రిటిషురాజకీయవేత్తలు పలుకుబడిగల పత్రికలు అంగీకరించాయి. దీనికారణం బ్రిటన్ స్వభావ సిద్ధమగు ద్వంద్వవిధానమే యైవుండాలి. అయినా చేంబర్లేన్ చేసిందియేముంది? ఫ్రాంసుతో మైత్రిచేశాడు. జార్జి (ఆరవ) చక్రవర్తిగారు ఫ్రాంసుకు దయచేస్తారని ప్రపంచానికి చాటించాడు. వొకవేపుయిలా చేసిమరోవేపు "రోము బర్లిన్" యిరుసుకున్న రెండురథ్యల్ని స్వయంగా చేతితో తాకి వాటిని కదిలించాలని ప్రయత్నించాడు. ఇంతేగాదు స్వయంగా స్వహస్తాక్షరితో ముసోలినికి ఉత్తరంరాశాడు: సంప్రతింపు లారంభించాడు. శేటునావైపై హాలిఫాక్సు ప్రభువుని హిట్లరువద్దకంపాడు. పాపం శేటునుండి ప్రభువుయింటికి చేరకలిగాడోలేదో తక్షణం హిట్లరు "జర్మని తన బలపదేశాల్ని సంపాదించేందుకు నేనాసస్వానాం పూర్తిచేసింద"ని చాటాడు. ఈకోరిక నెరవేరనంతవరకి వీరుడు యుద్ధభయం కోలిపెమాట నిశ్చయం.

సమయం కనిపెట్టింది బ్రిటన్ "ఆస్ట్రియాపై జర్మని అధిపత్యం సహించదు ముసోలిని. దీన్తో లాభముపొందాలని ముసోలినితో తిరిగి సంప్రతింపు లారంభింపబడ్డాయి. ఇవియేఫలించినా యెంతోదూరంలోలేదు బ్రిటన్ తన ఆత్మగౌరవాన్ని, ప్రజాపరిపాలనాతత్వాన్ని తిలోదకాలువదలి అబిసీనియాపై యేర్పడ్డ యిటలీ విజయాన్ని అక్షరాల అంగీకరించే చరిత్రలో నుల్లేఖించుటకు, రోజు మనోవేగంతో వస్తూవేవుంది. అది మనమంతా చూచేతీర్తాం.

చేంబర్లేన్ అవలంబించిన యీవైఖరి రష్యా ఫ్రాంసు, అమెరికాకు సంతోషకరంగా వుంది. మధ్యధరాసముద్రంలో బ్రిటన్ యోడలు పదేపదే ముంచివేయబడుతూవుంటే బ్రిటన్ తనకు జరుగుతూవున్న అవమానం పైమండిపండక హిట్లరు, ముసోలిని, ఫ్రాంకోల స్నేహితాలకి ఆపేక్షించుచూ వారికి తలయొగ్గుట యెందుకో అనే ప్రశ్న ప్రతివారిని బాధిస్తూవుంది. బ్రిటిషు ప్రాచ్యసామ్రాజ్యాల కలకం పీరిచేతవుంది. పశ్చిమంలో ఫాసిస్టుల అధిపత్యం మిక్కుటమైపోతూవుంది. తూర్పున జపాను దౌర్జన్యాల్ని చూచి చెదిరింది బ్రిటన్ మనస్సు, అన్నిమాస్తూ పీటితో యేలా పోయకు పూనుకోగల్గి వీండదృష్టిఅంతా తూర్పుకే కేంద్రీకరించుటచే వేరే వుపాయమేమి దోచుటంలా.

ఈత్రిమూర్తుల స్నేహితం చేకేందుకు మరి రెండు కారణాలు కనపడతూవున్నాయి. ప్రపంచం బలాన్ని, శక్తిని పూజిస్తూంది. బలాన్ని యెదుర్కొనే బలంలేనప్పుడు ఆమాంతం లొంగిపోవటం స్వభావం. ఇది వొకటి. రష్యా కమ్యూనిజంగాలియూరపుదేశపు ధనాఢ్యుల హృదలింపజేయుచున్నది. ఇట్టి విషవాయువు లేమియు ప్రసర్పించని ప్రదేశానవుంటానికి వీరు ప్రయత్నిస్తూవున్నారు. అయినా రష్యాలోగూడా ఆ కారల్ మార్క్స్ కమ్యూనిజం ఆరూపాన నామమాత్రమైన లేనేలేదు, పెనుగులాడిన ట్రాస్కీకి ప్రవాసశిక్ష అయింది. పీటైనంతకట్టుకిట్టివారిని స్టాలిన్ వురితీసి అనండిస్తూవేవున్నాడు. ప్రవాసదశ గడిపేందుకు విదేశాల్లోవున్నవారు హిట్లరు ముసోలినితో స్నేహం సంపాదించుకొని యుద్ధమేతప్పకుంటే రష్యాలో స్టాలిన్ సోషలిజాన్ని అంతమొందించాలని నిరీక్షిస్తున్నారు.

మొత్తంమీదసారాంశమేమంటే ప్రపంచంలోని కొన్నిదేశాలు సోషలిజానికి సమీపానవుండే ప్రజాపరిపాలనాని అశిస్తూవున్నాయి. మరికొన్ని హిట్లరు, ముసోలిని ఫ్రాంకోతెగకు చెందాలని ప్రయత్నిస్తూవున్నాయి. చేసుతూ వేవున్నాయి. నిజంగా ప్రపంచంలోఆత్మగౌరవం కలిగిన ప్రజాపరిపాలనాతత్వంగలజాతులేవైనా వుంటే వాటికి సద్గతి. మోక్షం ఆరష్యా సోషలిజంలో వున్నట్టు గోచరిస్తూ వున్నదనవచ్చు.

## రొమేనియా మంత్రివర్గపు రాజీనామా

బుఖారెస్టు, మార్చి ౩౧

మిరాన్ క్రిస్టా నాయకత్వమందలి సంయుక్త మంత్రివర్గమువారు రాజీనామా నొసగిరి.

దేశమునందు శాంతినెలకొలుపు విషయము యీ మంత్రివర్గమువలన ఫలించినటుల ప్రభుత్వమువారి ప్రకటన వెలువడినది.

రాజాగారు త్వరలో నియమించనున్న మంత్రివర్గమునందు పత్రికేయూదుక్ల సభ్య అధిక సంఖ్యలోనుండునటుల తెలియుచున్నది.

—

## ఆస్ట్రియా గవర్నరు అరెస్టు: ఆత్మత్యాగము

వియన్నా, మార్చి ౩౧

పూర్వపు ఆస్ట్రియా యుద్ధమంత్రియగు జనరల్ వాంగోయిన్ అరెస్టుగాబడిరి. వీరు యిటలీనుండి, విశ్రాంతి, యనంతరము, నిన్ననే యిచ్చటికిచేరిరి.

దక్షిణ ఆస్ట్రియా పూర్వ గవర్నరుఅగు వాన్ రీథరు ఆత్మత్యాగ మొనరించుకొనినటుల తెలియుచున్నది.

—

# ప్రభుత్వమువారి కీలుబొమ్మలు

రాజకీయ సంస్కరణ విచారణ సంఘములవలన ప్రజలకు మేలుకలుగునను విశ్వాసము లేదు.

## వీరి సిఫారసు లంగీకరించుట ప్రభుత్వపు యిచ్ఛాధీనము

(గోలకొండ విలేఖరి)

బెంగుళూరు, మార్చి (టపా)

"ఫెడరల్", రాజకీయ వ్యవహార విచారణ సంఘమువలన సంస్థానమునకు, ప్రజలకు మేలు కలుగునని నా కణుమాత్రమైన విశ్వాసము ముమ్మాటికి లేద"ని కాంగ్రెసు నాయకులగు శ్రీ కె. టి. భాష్యంగారు యిటీవల మైసూరుప్రభుత్వమువారు సంస్థానమందు రాజకీయ సంస్కరణముల ప్రసాదించుటకు, ఫెడరేషన్ యందు మైసూరు చేరవలయునా లేదా యను దానిని నిర్ణయించుటకు నిర్ణయించిన విచారణ సంఘముగురించి పత్రికాప్రకటన మొకటి ప్రకటించిరి

సంఘసభ్యుల గురించి "ఇది కేవలము పరిపాలక వర్గమువారి నిర్మాణము. సభ్యులందరు ప్రభుత్వమువారి నియోజకులు. వారి సలహాలు ప్రభుత్వమువారు తప్పక అంగీకరించవలయునని ప్రతిబంధకము లేనందున ప్రభుత్వమువారికి త్రోసివేయు వీలుగలదు. ప్రభుత్వమునకు వారి సలహాలు నచ్చిన శ్లాఘింపబడును మొత్తముపై అది శ్లాఘాపాత్రమే. ఇట్టి మాయజాలము నుండి మేలుకలుగునని యాశించవలయునా?" యని విశదపరచిరి.

"ఇదివరకు సలిపిన, సలుపని కార్యములకు ప్రభుత్వము బాధ్యత వహించుచుండెను. ఇక ముందు అధికారుల, అనధికారుల సిఫారసులతో సాంప్రదాయమను సాకుయొకటి కలిగించుకొనును. ఇట్టిసంఘముల స్వాతంత్ర్యమును నేను విశ్వసించను. ఇట్టిది ప్రభుత్వము వారి చేతి కీలుబొమ్మయగుట నిశ్చయము. నాకు సంఘమందలి ప్రతిసభ్యునిపై వ్యక్తిగతముగా గౌరవాదరముగలదు. శాసనసభకు పరిపాలకవర్గము అధీనము కానంతవరకు అట్టివారి నియామక సంఘమునకు ప్రజావిశ్వాసము కలుగజాలదు. శాసనసంస్కరణసంఘపు స్థితియు నిలువలేగలదు. అందువలననే నేను ప్రభుత్వమువారి అత్యమును విశదపరచ దలచుచున్నాము, ఈ వ్యవహార సంఘ ముపయోగకరముగాదు, నష్టదాయకము గాద"ని తెలియపరచిరి

---



# కాయకల్పము

## చికిత్సా వివరములు

—వి. ఆళ్వారుస్వామి.

పండిత మదనమోహన మాలవ్యా గారు పొందిన కాయకల్ప చికిత్స వివరాలు, వశ యుపరికరాలు క్రింద వివరిస్తాను.

మొదట శ్రీ తపసి బాబా విష్ణుదాస్ జీ ఉదాసిగారి గురించి మనవిచేస్తాను. వీరివద్దనే మాలవ్యాగారు చికిత్సపొందినది. వీరు గురునానక్ గారి శిష్యులు. పాటియాలా సంస్థానమునకు చెందినవారు. వీరు మూడు పర్యాయములు స్వయంగా చికిత్సపొందినారు. వీరికి ౧౩౦ఏండ్లుండును. వీరు పాటియాల సంస్థానాధీశుని పూర్వకుటుంబీకులలో ౧౦౦సంIIలకు ముందువారినికూడా ఎరుగుదురు. ౧౨౦ సంIIల క్రిందట బదరీనాథుకువెళ్లు మార్గవివరములు చెప్పగలరు. చాలాతీర్థయాత్రలు సేవించినారు. వీరుచూచుటకు ౪౦-౫౦ సంII ల వయస్సుగలవారుగా నుందురు వీరు తమ ప్రథమ చికిత్స అస్సామురాష్ట్రములో పరాశరఖండమను ప్రదేశములో పొందినారు. అరోజులలో బర్మీయుల ప్రథమయుద్ధము జరుగుచుండెను. రెండవచికిత్స ౪౦ సంIIరంలకు పూర్వము ముల్తాను జిల్లాలోని కోట్ఛన్ అను ప్రదేశములో పొందిరి. కొన్ని సంవత్సరములకు పూర్వము మూడవ చికిత్స పొందినారు. వీరు చాలాబలముగలిగి, దృఢకాయులునైయున్నారు.

వీరివద్దికి చాలామంది వైద్యసలహా పొందుటకును, సాధారణవ్యాధుల చికిత్స పొందుటకును వచ్చుచుందురు వీరివద్ద సామాన్యఔషధము లేయుండును. కాని గుణమిచ్చుటలో అమోఘము వీరు రోగులను చాలాశ్రద్ధతో ఆదరింతురు. ఈ కాయకల్ప చికిత్స వ్యాపారముగ గాని, దీనిని జీవనోపాధిగ నడుపుటగాని బాబాగారికి విశ్వాసము గలవారికిని, సరియగు సమర్థతగలవారికిని మాత్రమే ఏదైన విషయమూ బోధించెదరు. అట్టివిశ్వాసపాత్రులగువారిలో, బాబాగారిశిష్యులలో నొకరగు స్వామి కృష్ణదాసుగారొకరు బాబాగారు రెండవ పర్యాయము చికిత్సపొందినపుడు వీరే ఔషధముసిద్ధము చేసియుండిరి. నాటినుండియు నేటివరకు కృష్ణదాసుగారికే ఆచార్యత ఒప్పగింపబడినది

రోగులు

ఈ చికిత్సపొందువారు కేవలము ఒకరి ఒంటరిగమైగాక స్వాభిలాషులుగా నుండవలెను. వారు మతగ్రంథములయెడ విశ్వాసము, భక్తి కలిగియుండవలెను బోధనలను సక్రమముగా ఆచరించుటయేగాక మనస్సులో ఏలాంటి చికిత్సయెడ అవిశ్వాసము, నిర్లక్ష్యభావము కలిగియుండగూడదు బోధనలకారణము తెలిసికొన ప్రయత్నించగూడదు. ఆహారము పూర్తిగావదలి వేయవలెను క్షౌరముకూడా చేసికొనకూడదు సంభాషణ చేయకూడదు. గదిలో నున్నపుడు ఆవునెయ్యి దీపముల ద్వారా మతగ్రంథములు పఠించవచ్చును. వలయువారు పూజలు చేసికొనవచ్చును. కేవలము నల్లఆవు యొక్క పాలు, వెన్ననే ఉపయోగింపవలెను. అంతగా అవసరమున్ననేగాని నీరు వాడవలెను. నీరు తాకుట, త్రాగుటయు నిషేధము

చికిత్సలు

చికిత్సలలో చాలావిధములు గలవు. అందు నాలుగు చికిత్సలకై ఒకేఔషధము. ఈ నాలుగు చికిత్సలలోకూడా ఒకటి ఒకరోజులో మాత్రము ముగియునది. మరొకటి ఒకసంవత్సరములో ముగియునదికాదు. ఒకటి ఆరువారములలోగాని, అంతకు కొద్ది తక్కువకాలములో గాని ముగింపవచ్చును.

ఔషధములు

నాలుగు చికిత్సలకును ఒకవిధమైన మూలికలు పనికివచ్చును. ఈ మూలికలు సంవత్సరములోపల ఒకపర్యాయము మాత్రమే లభించును. ఇవిదొరకు సమయములు కూడా తెలుచు. ఈ మూలికలకై పరిశోధించు ప్రయాస తప్ప ద్రవ్యవ్యయము అవసరముండదు. వెలకూడ స్వల్పము. తక్కిన్ని చికిత్సలకు వలయుమూలికలు సంవత్సరము లోపుగ అప్పుడప్పుడు చాలా ప్రదేశములందు లభించుచుండును. పైనవివరించిన నాలుగు విధములైన చికిత్సకు వలయు ఔషధము సిద్ధము చేయదలచినపుడు మోదుగ (పాలాస్) అడివిలో ఒకగొయ్యిద్రవ్వి అందు మోదుగుకట్టెలు "ఓన్లా"అను వస్తువుతో పైనాలుగు మూలికలు కప్పివేయబడి గొయ్యిలో నుంచి ఆవు పిడకలతో కొన్ని గంటలకాలము భట్టీ పెట్టుదురు ఈవిధముగా ఒకసారి సిద్ధముచేసిన ఔషధము ఒకేమోతాదుకు సరిపోవును. ఈ మూలికలు లభించు కాలములో సేకరించి ప్రత్యేకముగా భట్టీలుపెట్టి ఒక్కొక్క మోతాదు సిద్ధముచేసి నిలువయుంచుదురు. ప్రతిదినము ఉదయము రోగులకు ఒకమోతాదు ఇవ్వబడుచుండును.

మదనమోహన మాలవ్యా గారు

మాలవ్యాగారు చాలాకాలమునుండి జబ్బుపడియుండుటచే తగుచికిత్సపొందుటకు చాలా ప్రయత్నములు చేసియుండిరి. కాని గుణము కలుగలేదు ఎట్టకేలకు మాలవ్యాగారి సహోదరులగు పండిత హరిదత్తశాస్త్రిగారి వలన తపసి బాబాగారితో పరిచయముగలిగెను. మాలవ్యాగారికి కార్యభార మధికముగ నుండుటవలనను, వారికుటుంబములో కాయకల్ప చికిత్స గురించి భేదాభిప్రాయము లుండుటవలనను తొందరలో ప్రారంభించజాలక పోయినారు. జనవరిలోనే తప్పని సరిగా ఏదిఏట్లున్నను చికిత్సచెందుటకు మాలవ్యాగారును, హరిదత్తుగారును నిశ్చయించుకొనిరి. కాశీలో కొన్ని అసందర్భము లుండుటచే అలహాబాదులోని గంగాతీరమందున్న రాంబాగ్ లో రెండు ప్రత్యేక గదులు నిర్మింపబడెను. మరియు అలహాబాదునకు ౩౦మైళ్లదూరమున నొక మోదుగ అడవిని మాలవ్యాగారు నొక సంస్థానాధీశునినుండి గ్రహించిరి. చివరకు ౧౯౩౮ జనవరి ౨౪ తేది శుభదినముగ చూచుకొని మాలవ్యాసోదరులు పాటోదిగ గదులలో ప్రవేశించిరి కాని వీరు ప్రారంభించుటలో ఆలస్యము జరిగినందున నిండుగా ఆరువారములు గడువక పూర్వమే చికిత్సచాలించిరి. అయినను, అలహాబాదువిశ్వవిద్యాలయ సువర్ణోత్సవ సందర్భములో కూర్చొని, చాలా అయాసముతో, మెల్లగా ఉపన్యసించిన మాలవ్యాగారు ప్రస్తుతము ధారాళముగా మాట్లాడగలరు. స్పష్టముగా చూడగలరు. బాల్యదశలో అభ్యసించి మరచిన శ్లోకములు నిరాఘాటముగా చదువగలరు యిదివరలో వంగినడచువారు ఇప్పుడు చక్కగా నిలుచుండగలరు, జ్ఞాపకశక్తి కలిగినది. దంతవైద్యునిచే కత్తించుకొనినటుల పండ్లు ఊడిగివచ్చినవి. వీరి సహోదరులగు దత్తుగారికిని మంచి గుణమిచ్చినది. మాలవ్యాగారికంటె దత్తుగారికే ఎక్కువ లాభము చేకూరినటుల తెలియుచున్నది.

సైమ్యు వీక్లి

---



### గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)

హైద్రాబాద

చందా వివరములు

సంవత్సరమునకు రు ౬లు

అర్ధసంవత్సరమునకు రు ౩లు

విడిపత్రిక ౧ అణా

The only Leading National Bi-weekly of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

Volume 12 | Hyderabad-Dn. | Monday 4th April 1938 | Number 92


## స్త్రీలపై లాఠీ ప్రయోగము

అహమదాబాదు, ఏప్రిల్ ౧

అఖిలభారత మహిళా మహాసభ్యురాలగు శ్రీమతి పన్నారు మెహత మరియు శ్రీయుత చంపాయిక్ మెహతా గారలు పంజపురములో పోలీసులు స్త్రీలపై జరిపిన లాఠీ ప్రయోగము పరిశీలన పూర్తి చేసి తిరిగివచ్చినారు. వీరు తమ అభిప్రాయము పత్రికా ముఖమున తెలుపనున్నారు.

## బ్రిటిష్ బల సంపాదన

లండన్, ఏప్రిల్ ౧

“సమాధానము అవలంబించుటయందు కేవలా సమరము తప్పించుటకు శక్తిగొలిపి ప్రయత్నించుట దుర్బల లక్షణము కాజాలదు. బ్రిటిషుజాతి బలము కాంక్షించుచున్నది. యూరపునందు తనధ్వని ప్రతిధ్వనింప జేయుటకు శక్తి సంపాదనలో లీనమగుచున్నది. విదేశాంగ నీతివిషయములో ప్రభుత్వమునకు, ప్రజలకు మూలతత్వమునందు విభేదములుగలవని యను కొనట గొప్పపొరపాటు, అవివేకమనుట నిశ్చయము”ని విదేశాంగమంత్రులగు లార్డు హాలిఫాక్సుగారు విదేశపత్రికా సంఘమునందు ఉపన్యసించిరి.

## ఫ్రాంసులెహా ఫ్రాంకు విమానములు

ప్యారిసు, మార్చి ౩౧

ఫ్రాంసువారి సరిహద్దుపైగల పోర్టుబోయు ను స్పెయిన్ నగరముపై బాంబులప్రయోగించి తిరిగి వచ్చుచుండిన ఫ్రాంకో విమానములపై అ సరిహద్దు ప్రాంతమునందు ఫ్రాంసువారి సైనిక నిరోధక వర్గమువారు ఫిరంగుల ప్రేల్చిరి.

దీనివల యిద్దరు మరణించినటులను, పోర్టుబోయందపరిమితముగు నష్టమేర్పడినటుల తెలియుచున్నది.

ఫ్రాంకో విమానములు పోర్టుబోనుండి ప్యూయిక్ కుగల రైల్వేలైనుపై ఎగురుచుండ ఫ్రాంసువారు కొలాయరు ప్రదేశమునందు ఫిరంగులపేల్చిరి.

## కసూరులెహా మద్యపాన నిషేధము

లాహోరు, ఏప్రిలు ౨

లాహోరుకు ౩౫ మైళ్ల దూరమునగల యీ గ్రామమునందు నిన్నటినుండి సంపూర్ణ మద్యపాన నిషేధము ప్రజాభిప్రాయానుసారము సాగింపబడుచున్నది. పంజాబు లోకల్ అప్షన్ శాసనానుసార మీ విషయము వోటరులకు తెలుపయుంచుటనిమిత్తమై వోటర్లందరు ప్రరిపాలక వర్గమువారిని యేకాభిప్రాయముతో మద్యపాన నిషేధము తీర్మానించుటకు అభిప్రాయ మొసగిరి.

ఈ గ్రామమందలి మొత్తము వోటర్లు ౧౨౭౫. ఈ విషయమునందు ౭౮౫ వోటరులు పాల్గొనిరి. మద్య నిషేధమునకు ౭౮౩ వోట్లు నొసగబడినవి. రెండువోట్లు మాత్రము దీనికి ప్రతికూలముగా నొసగబడెను.

## ౩౦౦౦౦ సైనికులు వైయన్నా చేరుట

వైయన్నా, ఏప్రిల్ ౧

జోల్లపెప్, షూష్నిగ్ అత్యాచారములు భరించలేక జర్మనీయందు తలదాచుకొనియుండిన ౩౦౦౦౦ ఆస్ట్రియా సైనికులు ౭౦౦ మోటారు కారులలో వైయన్నా నగర మేతెంచుచున్నారు. వీరందరు నాజీ సానుభూతులు. మరి ౨౦ లారీలలో కొందరు రానున్నారు. వీరంద రు రేపు వైయన్నానగరము ప్రవేశించెదరు.

## చక్కెరపై యుక్స్టైజు పన్ను వివరములు

### క్రొత్త రెగులేషను తయారైనది

బయటిచక్కెరపై దిగుమతిపన్ను గాక క్రొత్తపన్ను

హైదరాబాదు (దక్కన్).

ప్రభుత్వప్రకటన శాఖవారు ఈ క్రింది ప్రకటనను పత్రికల కందచేసినారు: —

మహాఘనతవహించిన ప్రభువుగారు ఈరాష్ట్రములో ఏకార్ఖానాలోగాని తయారుచేయబడిన అన్నిరకముల చక్కెరపైని యుక్స్టైజుపన్నును విధించుటకును, దానిని వసూలు చేయవలసిన పద్ధతులకొఱకును అజ్ఞలుగల రెగులేషనును దయతో ఆమోదించినారు. ఆ రెగులేషనునందు ముఖ్యములైన దఫాలలోకొన్ని ప్రజలకు తెలియుటకై ఈ క్రింద ప్రకటించబడుచున్నవి.

దఫా౩ (౧) మ.ఘ.వ. నిజాంగారి రాష్ట్రములో ఏకార్ఖానాలోగాని ఉత్పత్తి చేయబడి, ఆకార్ఖానానుండి బయటికి పంపబడునట్టి, లేక ఆకార్ఖానాలో నేచక్కెరగాక మరియొకపదార్థమును తయారుచేయుటకు ఉపయోగించబడునట్టి అన్ని చక్కెరలమీదను యుక్స్టైజుపన్ను వసూలు చేయబడును; దానిని కార్ఖానా యజమాని చెల్లించవలెను.

(౨) ఈదఫాలోని (౧)వభాగమందు చెప్పబడినపన్ను ఈ క్రింది రేట్ల ప్రకారము హాలీ సిక్కాలో చెల్లించబడవలెను.

(అ) ఖాండసారి చక్కెరపై ఒక్కొక్క హండ్రెడువెయిటుకు ఒకరూపాయ రెండణాల చొప్పునను;

(ఆ) ఒక్క తాటిచక్కెర తప్ప తక్కిన అన్నిరకముల చక్కెరలమీదను ఒక్కొక్క హండ్రెడువెయిటుకు రెండురూపాయల అయిదణాల చొప్పునను;

(ఇ) తాటి చక్కెరపై, ప్రభుత్వమువారు తమకవసరమని తోచి విచారణచేసి, నిర్ణయించు లెక్కప్రకారమును.

కాని, ప్రభుత్వమువారు జరీదాలో ఒక ప్రకటనగావించి, ఏచక్కెరపైకముగాని ప్రత్యేకముగ పేర్కొని ఆచక్కెరకే దానిపైవసూలు చేయదగినపన్నును సంపూర్ణముగగాని లేక కొంతభాగముగాని లేకుండ చేయవచ్చును.

దఫా౫. ఎవడుగాని ఏకార్ఖానానుండిగాని చక్కెరను, ఈవిషయములో ఈ రెగులేషను క్రింద చేయబడు నిబంధనల ననుసరించి తప్ప లేదా అట్టినిబంధనలు చేయబడనంతకాలము ప్రభుత్వమువారి సాధారణాజ్ఞలో లేక ప్రత్యేకాజ్ఞలనో అనుసరించితప్ప, మరియొక విధము బయటికి పంపరాదు.

దఫా౭. ప్రభుత్వమువారు భారతదేశములో: (ఈ రెగులేషనుక్రింద విధించబడునంత యుక్స్టైజుపన్ను వసూలుచేయని) మరియే సంస్థానముమండిగాని మ ఘ వ, నిజాంగారి రాష్ట్రములోకి తేబడునట్టి చక్కెరపై, సుంకము పన్నుమాత్రమే గాక, ఈ రాష్ట్రములో తయారుచేయబడు చక్కెరపై ఈరెగులేషనుచే విధించబడుచున్న యుక్స్టైజుపన్నుకు సమానముగు పన్నుకూడ, జరీదాలో ముందుగ వెల్లడి చేసి, వసూలు చేయవచ్చును.

దఫా౧౦. ప్రభుత్వమువారు జరీదా మూలముగా, ఇపుడు అమలులోనున్న సుంకపు శాసనములో సుంకపుపన్నును వసూలు చేయుట, మాఫీచేయుట, పన్నులో పొరపాటు, నేరములు, శిక్షలు, మురాఫాలు అను విషయములకు సంబంధించిన ఏర్పాట్లలో ఏదిగాని, తమకు వాటిని అప్పటిపరిస్థితులకు తగినట్లు చేయుటకై అవసరములు లేక ఆక్షేపణీయములు అని తోచు సవరణలతోను, మార్పులతోను, ౩వ దఫాచే చక్కెరపై విధించబడుపన్నుకు సంబంధించిన సమానవిషయములలో అన్వయించగలవని ప్రకటించవచ్చును.

## నిర్బంధితుల విడుదల

మద్రాసు, ఏప్రిల్ ౧

మద్రాసు సెంట్రల్ జెలునుండి మరి అయిదుగురు ఖయిదీలు విడుదల చేయబడినటుల నేఱము విలేఖరి తెలుపుచున్నారు. మద్రాసు జేలునుండింకను ౧౨౫ నిర్బంధితులు విడుదల కానున్నటుల తెలియుచున్నది.

## శ్రీమతి కస్తూరిబా ఆగమనము

ఢిల్లీ, ఏప్రిల్ ౨

శ్రీమతికస్తూరిబా గాంధిగారు తనరెండవకుమారుడగు మణిలాల్ గాంధిని ఒరిస్సాయందుచూచి చిన్నకుమారుడు దేవదాసు గారివద్దకు ౪,౫ తేదీలలో వచ్చుచున్నారు. ఒకనెల యిక్కడవుండగలరని తెలియుచున్నది.



## తీవ్ర యుద్ధము

షాంఘాయి, ఏప్రిల్ ౧

ఇచ్చటికి (౬౦) మైళ్ల దూరమున దక్షిణభాగమున తీవ్రయుద్ధము జరుగుచున్నది. శిక్షణ బొందిన చీనా పటాలమొకటి షాంఘాయి, వూహూ, హాంచౌయందు పోరు సలుపుచున్న పటాలముతో చేరెను. వారు గడచిన పదిరోజులలో (౨౦) మైళ్లు ఆక్రమించుకో గలిగిరి.

ప్రతిదినము గాయపడుచున్న ౧౫౦ జపాను సైనికులు షాంఘాయికి ఉపచారార్థము చేర్చబడుచున్నారు. జపానువారు చీనాసైనికుల వద్దగించుటకు షాంఘాయి రైలుమార్గము నాశనము చేసి షాంఘాయికి పడమట సౌచుదిశకు వెళ్లుచున్నారు.

## నూతన సమర సన్నాహములు

రోము మార్చి౩౧

సెనెటుప్రబోధానంతరము సీసార్ ముసోలిని ప్లాజో వెనేజ్యాయందు సెనెటుసభ్యులలో కొందరిని దర్శించినసందర్భమున నూతన సైనికోద్యమమొకటి సూచింపబడెను. సెనెటువారిదివరకు వీరికి మార్షల్ ఆఫ్ది ఎంపైరుబిరుదు నొసగియుండిరి. అదివిషయముపై వీరు “ఈగౌరవ ప్రదానముతో మన సామ్రాజ్యపు మూడవ విజయప్రయత్నముకై నాకర్తవ్యము హెచ్చుచున్నది. దీనియందు నేనే పథాధ్యక్షునిగా కోర్పడెదన”ని నుడివిరి. కాని అధికారరీత్యా యీవిషయ మింతవరకు అంగీకరింపబడలేదు.

## పత్రికా ప్రతినిధుల సౌకర్యములు

### మదరాసు ప్రభుత్వమువారి ఉత్తరువు

మదరాసు ఏప్రిలు ౧

మదరాసుప్రభుత్వమువారిట్లు ప్రకటించుచున్నారు.

పత్రికాప్రతినిధులకు తగినసౌకర్యముల నొసగుటలేదనియు, ప్రభుత్వశాఖల ముఖ్యులచేతను, ప్రభుత్వోద్యోగులచేతను జరుపబడు పబ్లికుకార్యములలోను, సభలలోను పత్రికాప్రతినిధులకు స్థానమొసగుటలేదనియు మొఱలు వచ్చినవి. వార్తాపత్రికలకు సహాయపడుటయే ప్రభుత్వమువారి అభిమతము. ౧౯౩౭ సం. ఫిబ్రవరి ౧౭వ తేదినాటి ౨౫౪౭—౧ పబ్లిక్ (జనరల్) మెమొరాండములో జిల్లా మేజస్ట్రేటులకు, పోలీసు కమీషనరుకు, ప్రభుత్వశాఖాధికారులకు పత్రికల ప్రతినిధులను దరిజేర్చవలెననియు, జరిగిన విషయములయొక్క యథార్థకథనములను ప్రభుత్వమువారి పద్ధతులను వారలకు తెలుపవలెననియు, చెప్పబడెను ప్రభుత్వమువారి పనికిగాని విధానమునకుగాని సంబంధించిన నిజమైన అంశములను సాధ్యమైనంతత్వరలో తమతమ ప్రదేశములలో వెల్లడి చేయుటకు తమకులోచిన చర్యలు గైకొనవలెనని జిల్లామేజస్ట్రేటులకు ఇదివరకే అధికారమీయబడినది.

పత్రికలలో విపరీతముగ తోచునట్టియు, సత్యములు కానట్టియు సంగతులు ప్రచురించకుండ చూచుట చాల ముఖ్యము గావున జిల్లా కలెక్టరులు, జిల్లాలోని ప్రభుత్వశాఖల ముఖ్యులు, కార్యనిర్వాహకశాఖాధికారులు, న్యాయనిర్వహణశాఖాధికారులు పత్రికాప్రతినిధులతో సంబంధము కలిగియుండవలెను. పత్రికాప్రతినిధులు సరియైన సమాచారముపొందుటకు ఫలానాసమయములో తమతావుకు రావలెనని ప్రోత్సహించవలెను. ప్రఖ్యాతిగాంచిన పత్రికలకు సరియైనవార్తల నిచ్చుటయే దీనియుద్దేశము గాని, అభిప్రాయములను తెలుపుటకాదు ఇట్లు ఇచ్చినవార్తలకు అధికారభావముల రంగునుగాని, రాజకీయమైన రంగునుగాని వేయరాదు. తామిచ్చువార్తల యథార్థతకు ఆ యధికారులు బాధ్యులై యుండగలరు, స్పష్టము కానట్టి అసంపూర్ణమైనట్టి సమాధానము నొసగుట మానుకొనవలెను.

నోటీసుబోర్డులమీదనుంచు నోటిఫికేషనులు నివేదికలు అవసరములేదని తోచునపుడు అధికారులెవరును వాటిని బోర్డుమీదనుంచి తొలగించరాదు. పాతపడినవాటిని ఉంచరాదు.

అన్ని స్థానిక స్వపరిపాలన సంస్థలును కోరినపుడు కార్యక్రమపద్ధతులను పత్రికాప్రతినిధులకీయవలెనని సహాయ మొసగబడినవి.

## సంస్థానమందలి రాజద్రోహనేర విచారణ

### రాజకీయనేర మొనర్చిరను నేపముపై నారిమన్‌గారు నిందితునిపక్షమున వాదింపజాలరని కోర్టువారు ఆక్షేపించుట

### నారిమనుగారి ఆగమనము రాజకీయసంచలన కారణమని అడ్వకేటు జనరల్ వాదించుట

(గోలకొండ విలేఖరి)

తిరువేంద్రము, ఏప్రిల్ ౨

అడిషనల్ మేజస్ట్రేటుగారి న్యాయస్థానమునందు నారాయణ పిళ్ళెగారిపై ఆరోపింపబడిన రాజద్రోహ అభియోగము విచారణార్థము రాగా నిందితునిపక్షమున వాదించుటకు రుచించిన కె. ఎఫ్. నారిమన్‌గారు నిరాకరించపడిరి.

“నారిమన్‌గారిదివరకు రాజకీయనేరముల క్రింద నిర్బంధింపబడిరి. వీరి రాకవలన రాజకీయ సంచలనము ప్రారంభమైనది, తిరువేంద్రమునందు వీరుపన్యసించ వీలులేదని జిల్లామేజస్ట్రేటుగారు నిషేధించిరి”ని ప్రభుత్వ న్యాయవాదిగారు ప్రమాణపూర్వకముగా న్యాయాధీశుని కెరింగించిరి.

“రాజకీయనేరములకు గురియైనవారు న్యాయస్థానమునందు వాదించవలదని యొట్టిఆజ్ఞయు నింతవరకు అమలునందులేదు ఇదేగాదు నాతో విచారింపబడినవారలలో కొందరు నేడు తిరువాన్కూరు సంస్థానముకన్న పెద్దరాష్ట్రములలో ప్రభుత్వసారథులుగా గలరు. ఎందరో అడ్వొకేటు జనరలు వీరి యాధీనమునందు గల విషయము మామ్రతులకు తెలియకపోద”ని నారిమన్‌గారు ప్రత్యుత్తర మొసగిరి.

“అడ్వొకేటు జనరల్‌గారొసగిన ప్రమాణపత్రమందలి విషయము అతిచిత్రముగా గలవు. విచారణజరుగు సందర్భమున రాజకీయకారణములు చూపవీలులేదు. నీతిబాహ్యమగు నేరములు సలిపినవారు న్యాయస్థానమునందు వాదింన వీలులేదనవచ్చు”ననిరి.

“ఇతరప్రదేశముల విషయము తెందుకు? ఈ తిరువాన్కూరు సంస్థానమునందే రాజకీయనేరములు సలిపినవారికే న్యాయస్థానములందు ప్రాక్టీసు చేయ ననుమతింపబడినది. జార్జిజోసఫ్ మొదలగువారి వ్యవహారము లించుక కోర్టువారు దిలకించవచ్చును. న్యాయవాదిగా అభియోగమునందు వాదించ వీలులేకుండిన ముఖ్యాయుగానైన అంగీకరించవలయున”ని కోర్టును విచారించెను.

సంస్థానమునందు అరితేరిన న్యాయవాదులలోటులేదనియు, నారిమన్‌గారి కనుమతింప వీలులేదనియు అడ్వొకేటు జనరల్‌గారనిరి.

అంత నిందితుడు సంస్థానమందొక న్యాయవాదిని విచారించ “ఇది సంస్థానమందలి రాజద్రోహనేరము కాబట్టి నేనంగీకరించజాల”నని విశదపరచుటచే నారిమన్‌గారిని నియమించితినని, వారి కనుమతి ప్రసాదించకున్న న్యాయము, విచారణ పరిపూర్తి కాజాలదని జలికెను.

కోర్టువారు నారిమెన్‌గారిని నిరాకరించుచు సంస్థానమందింతమంది న్యాయవాదులుండ వీరేల నియమితులైరో అశ్చర్యము విశదపరచెను.

నారిమన్‌గారు న్యాయస్థానమువదలవారివెంట అడ్వొకేటు జనరల్‌తప్ప యితరన్యాయవాదులందరు నారిమెన్‌గారిని వెంబడించిరి.

నిందితుడు తనవిషయమై యేసాక్ష్యము పెట్టదలచనటుల కోర్టువారి వ్రాతపూర్వకముగా తెలియపరచెను.

## మఝుబీ సిక్కుల సత్యాగ్రహము

పెషావర్, ఏప్రిల్ ౨

జనమస్థమ గురుద్వారా నానాక్షా సాహెబు యందింతవరకు ౧౦౨ మంది మఝుబీ సిక్కు లరెస్టుగాబడిరి.

కొంత కాలమునకు పూర్వము గురుద్వార యందు కొన్ని సంస్కరణముల గావింపదలచి మఝుబీసిక్కులకోరాత్రము దివాన్ ప్రవచనము ప్రారంభించిరి. వారము రోజుల పిదప గురుద్వార వ్యవస్థాపకులు శాంతిభంగము కలగనున్నటుల గ్రహించి మఝుబీసిక్కులు మాసము రోజులవరకు గురుద్వారమునకు రాబోలు రేదని ౧౪౪ సెక్షన్ ప్రకారము నిషేధాజ్ఞల ప్రకటించిరి.

మఝుబీసిక్కు లీయాజ్ఞోల్లంఘనముకై ప్రతిరోజు ౫ గురు స్వయంసేవకుల బంపుచున్నారు.




Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Rao